# శోభిల్లు...సప్తస్వర

—వెంపటి రామ్మూర్తి



'విజయ' అనుబంధ మాలికతో

వెలువడిన యాభై తొమ్మిదవ నవల

విజయ

80. ధనలక్ష్మీ కాలనీ

మద్రాసు-26

విజయ అనుబంధం 2

'VIJAYA' SUPPLEMENT No: 67
MAY 1981
"SOBHILLU...SAPTHASWARA"
BY VEMPATI RAMMURTHI

ముఖచిత్రం: గంగాధర్

వెల: చెల్లింపలేనిది

(ఇది 'విజయ' పత్రికతో పాఠకులకు
యివ్వబడిన అమూల్య కానుక)



ప్రింటర్స్:
విజయా గ్రాఫిక్స్,
210-ఆర్కాట్ రోడ్,
మద్రాసు-600 026.



# శోభిల్లు సప్తస్వర

— వెంపటి రామ్మూర్తి

ఉదయం ఎనిమిది గంటలు కావస్తుంది. ఫ్యాక్టరీలకు వెళ్ళే కార్మికులు, బస్సులపై ప్రయాణంచేసి స్కూళ్ళకి వెళ్ళవల్సిన విద్యార్థులూ, ఉపాధ్యాయులూ, మరెందరో హడావుడిగా రోడ్డు మీద అటూ, ఇటూ వెళుతూ వున్నారు. అందులోనూ అది మరీ అభివృద్ధియైన బస్తీగాబోలు ప్రతి ఒక్కళ్ళూ నాగరికంగా కనిపిస్తూ వున్నారా సెంటర్లో.

అదే సెంటర్లో రోడ్డునానుకుని ఉందీ ఇల్లు. ఆ ఇంట్లో పూజామందిరంలో కూర్చుని వున్నాడతను. అతని వయసు దాదాపు అరవై సంవత్సరాలు ఉండవచ్చును. కాని ఆయన శరీర ధారుఢ్యాన్ని చూస్తే యాభై సంవత్సరాలవాడిలాగే కనిపిస్తాడు. పసుపు పచ్చని రంగు శరీరచ్ఛాయ, ఆజాను బాహువైన విగ్రహం, లేత గులాబీరంగు పట్టుధోవతీ, గంధపు రంగులో పట్టుకండువా, భుజం మీదనుండి ధోవతీమీదకు జారిన తెల్లని యజ్ఞోపవీతమూ, ముంజేతుల పైనా, మోచేతులవద్దా, భుజాలకు, ఛాతిపైనా విభూధి రేఖలూ, నుదుటి మీద విభూధి రేఖల మధ్య గంధపు చుక్కా గంధం కనీ కన్పించ కుండా ఎర్రని కుంకుమ బొట్టూ, ఉండీలేనట్టు సన్నని పిలకా,

హఠాత్తుగా చూస్తే పరమశివుడు కైలాసంనుండి దిగివచ్చాడా అనిపించే సుందరదృశ్య రూపమది.

ఆయన పులిచర్మంపై ఆశీనుడై దేవుడి విగ్రహాలకు నిన్నటి రోజున పెట్టిన పూలుతీసి దేవుడి పీఠం క్రింద వున్న పాత బుట్టలో వేస్తున్నాడు. ప్రక్కనే మరో రెండు పూలబుట్టలు ఆనాటి పూలతో నిండి ఉన్నాయి. ప్రక్క గదిలోనుండి రేడియో కార్యక్రమాలు వినిపిస్తూన్నాయి. ఆయన దేవుడి విగ్రహాలకు పెట్టిన పూలన్నింటినీ తీసి బుట్టలో వేసి కొద్దిగా ముఖం పైకెత్తి-

"అమ్మాయ్ శాంతీ! రేడియో కట్టేసి ఇవ్వాళ విచ్చిన గులాబీ పూలు కోసుకురామ్మా!" అన్నాడు.

ఆయన ఈ మాటల్ని నెమ్మదిగానే అన్నాడు. గొంతు చించుకోలేదు. అరవలేదు. కాని ఆ ఇంటిలో ఉన్న ప్రతి గదిలోనూ ఆ మాటలు ప్రతిధ్వనించాయి. గంభీరమైన ఆ కంఠంలోనుండి వెలువడిన మాటలు కంచు మ్రోగినప్పుడు వచ్చే శబ్దంలా ఖంగుమన్నాయి.

ఆయన మాటలు ఆ శాంతి అనే ఆమెకి వినిపించాయో లేదో గాని జవాబు మాత్రం రాలేదు. జవాబుకొరకు కొద్ది క్షణాలు మాత్రం ఎదురుచూపి ఆయనే లేచాడు.

ప్రక్క గదిలోనికి వచ్చి తిన్నగా రేడియో ముందుకు వచ్చాడు. రేడియో కట్టేయడానికి కుడిచేతిని రేడియో దగ్గరగా జాపాడు. అంతలో రేడియోలో ఎనౌన్సర్ కంఠం వినిపించింది.

"ఈనాటి సంగీతప్రియ కార్యక్రమంలో శ్రీ త్యాగరాజశర్మ గారి గానం వింటారు. ముందుగా 'వాతాపి గణపతిం భజే' ముద్దుస్వామి దీక్షితులుగారి కృతి, హంసధ్వని రాగం, ఆదితాళం."

తరువాత గానం ప్రారంభమయ్యింది. కాని అదంతా రేడియో ముందు నుంచున్న ఆయన చెవికెక్కడం లేదు. తల తిరుగుతోంది. భూమి తిరుగుతోంది. అక్కడ వున్న ప్రతి వస్తువూ తల క్రిందులుగా కనబడుతోంది. సంతోషమో, దుఃఖమో, కోపమో, శాంతమో, ఆనందమో, ఆశ్చర్యమో ఏదో ఇదమిద్ధమని తేల్చలేని భావోద్వేగం ఆయన్ని ఆవరించింది. అంత మనిషీ నిలువునా చమటలు

పట్టి పోయాడు. కళ్ళు మైకం క్రమ్మినట్లుకాగా తన్ను తాను నిగ్ర హించుకునే శక్తిని కోల్పోయినట్లు ప్రక్కనున్న సోఫాని పట్టుకుని మెల్లిగా అందులో కూర్చున్నాడు.

'ఎలా జరిగిందిది? ఇది కలా? నిజమా? భ్రమా? యధా ర్థమా?' ఇక ఆ పైన ఆలోచించగలిగే శక్తి లేదతనికి. తల బ్రద్దలై పోతుందేమోనన్నట్లుగా తలని ఎడమ చేత్తో గట్టిగా అదిమి పట్టుకుని అలాగే సోఫాలో కూర్చుండిపోయాడు. అలా ఎంతసేపు కూర్చు న్నాడో ఏమో, బాపూ బొమ్మలోలాంటి ఓ చక్కని అమ్మాయి, "తాతయ్యా!" అని కుదుపుతూ పిలిచేసరికి అతనికి మైకం వదలి నట్లయింది.

ఆ అమ్మాయే తిరిగి ఇలా అంది-

"తాతయ్యా! ముందు నిన్ను పిలిచాను. పలక్కుంటే సంగీత కార్యక్రమం వింటున్నావేమో ననుకున్నాను. కాని ఆ కార్యక్రమం ముగిసినా, నేను రేడియో కట్టేసినా, నిన్ను నాలుగుసార్లు పిలిచినా నీవు అదే స్థితిలో వుండేసరికి భయమేసింది. ఎందుకలా వున్నావు? ఏమయ్యింది? తల పట్టుకొని కూర్చున్నావెందుకు? ఒంట్లో బాగాలేదా తాతయ్యా?" అంటూనే ఉంది.

ఆమె కళ్ళల్లో నీళ్ళునికి చటుక్కున బుగ్గల మీదకు పడ్డాయి. అది చూసి ఆయన చలించిపోయాడు.

"అయ్యో చిట్టితల్లీ! నిన్నెంత నొప్పించానమ్మా? ఏం లేదమ్మా! రేడియోలో సంగీతం వింటూ మైమరచి కూర్చున్నా నంతే....అంతేనమ్మా!" అన్నాడు తడబాటుగా. అప్పటికి ఆ పిల్ల మనసు తేలికయ్యింది.

కళ్ళలో నీళ్ళుండగానే దుఃఖాన్ని తేలిగ్గా తీసుకుని నవ్వుతూ, "అవును తాతయ్యా! అద్భుతంగా పాడాడు కదూ! కంఠం కూడా తీయగా చెవుల్లో అమృతం పోసినట్లుంది" అంది.

"అవునమ్మా!" అని, "ఆఁ శాంతీ! నిన్నటి గులాబీమొగ్గలు ఈరోజు విచ్చుకున్నాయి. పూజకి నాలుగు కోసుకు రామ్మా!" అంటూ తన పూజ గదిలోనికి వెళ్ళిపోయాడు.

రెండు నిముషాలలో పూలతో పూజామందిరంలోనికి వచ్చిన

శాంతి పూలు బుట్టలో వుంచుతూ-"ఇందాక పూలు తెమ్మని నీవు కేక వేసినప్పుడు స్నానం చేస్తున్నాను" అంది- అందుకే పూలు తేలేక పోయానన్న ధోరణిలో. ఆ మాటలకు ఆయన ఏమీ జవాబు చెప్ప లేదు. శాంతి కొద్దిసేపక్కడ నిల్చుని పూజామందిరంనుండి బయటకు నడిచి ఆ గది తలుపులు శబ్దంగాకుండా దగ్గరగా లాగి వెళ్ళిపోయింది.

శాంతి వెళ్ళిన తర్వాత ఆయన విగ్రహాలను కడిగి పూలు, కుంకుమా పెట్టి దీపాలూ అగరుబత్తులూ వెలిగించాడు. పూజ చేసాడు. కాని ఆయన మనసు, ఆయన చేస్తున్న ఏ పనిమీదా లగ్నం కావడం లేదు. దేవుడికి అరటిపళ్ళు, చక్కెరా నైవేద్యం పెట్టి అక్కడ నుండి లేచి తన పడక గదిలోనికి వచ్చాడు. వేపాకు కషాయం త్రాగిన నోరులా వుందాతని మనసు. తనేం చేస్తున్నాడో తెలియని స్థితిలో మంచంపై దిండునానుకొని వెల్లకిలా పడుకొన్నాడు.

అంతలో "తాతయ్యా! ఈరోజు...." అని ఏమో చెప్పడానికి ఆ గదిలోనికి వచ్చిన శాంతి ప్రపంచంలో పదవ వింత చూస్తు న్నట్టుగా ముఖంపెట్టి, ఆశ్చర్యంగా చూస్తూ రెండు నిముషాలు గడి పింది. తర్వాత తేరుకుని నెమ్మదిగా మంచంవద్దకు నడచి ఆయన కాళ్ళపై చేతులు వేసింది. సృష్టిలోని మాధుర్యాన్నంతా తన కంఠం లోనే నింపుకుని నెమ్మదిగా___

"తాతయ్యా!" అంది.

ఆమె పిలుపుకి ఉలిక్కిపడి, "నీవెప్పుడొచ్చావమ్మా?" అన్నాడు. ఆమెనీ ప్రశ్నయితే వేసాడు గాని సమాధానం వినడం ఇష్టంలేని వాడులా- "అమ్మా శాంతీ! గోపాలరావుగారికి ఈరోజు రాలేనని కబురు పంపించమ్మా వెంకన్నతో. కళాశాలకి వెళ్ళి చెప్ప మను!" అన్నాడు- తన కాళ్ళపైనున్న ఆమె చేతులు తీయడానికి ప్రయత్నిస్తూ.

కాని ఈ సారి ఆశ్చర్యాన్ని ముఖంలోనే దాచుకుంటూ అయన పాదాలు నెమ్మదిగా వత్తుతూ- "ఇందాక వంట్లో బాగో లేదా?" అని అడిగితే 'కాద'న్నావు. కాని ఏం బాధో నాతో చెప్ప కూడదా? దేవుడి గదిలోనికివెళ్ళి చూద్దునుగా-పూజంతా అస్తవ్యస్తంగా చేశావు. పూజచేసుకునే పట్టుబట్టలతో సోఫాలైనా తాకవు. అలాం

టిది మంచంమీద పడుకున్నావు. సాధారణంగా కాలేజీ మానుకోని నువ్వు రాలేనని కబురు చెయమంటున్నావు. ఏమిటిదంతా? నీబాధ ఏమిటో నాకు చెప్పకూడదా? లేక నేను బ్రతికే ఉన్నానని మరచి పోయావా?" అంది దైన్యంగా.

శాంతి మాటలు ఈసారి ఆయనపై బాగా పనిచేశాయి. కాళ్ళ దగ్గరగా లాక్కుని లేచి కూర్చుంటూ—

"శాంతీ! నాకు వంట్లో బాగాలేని మాట నిజమే. కాని మనసు కూడా బాగోలేదు. ఐనా ఇంతమాత్రానికే అంతగా బాధ పడతారా ఎవరైనా? లే! లేచి కాలేజీకి వెళ్ళు. టైము ఎక్కువగా లేదు. త్వరగా వెళ్ళు!" అన్నాడు.

ఆయనమాటలు విని శాంతి, "తాతయ్యా! నాకుకూడా ఈ రోజు కాలేజీకి వెళ్ళాలని లేదు!" అంది.

"పిచ్చిపిల్లా! నీకు ఎందుకు వెళ్ళాలని లేదో నాకుతెల్సు. నాకేం ఫరవాలేదు. నువ్వెళ్ళిరా! పరీక్ష ఏదో ఉందన్నావుగా: రాత్రంతా కష్టపడి చదివావు కూడాను. ఇలా చిన్న చిన్న విషయాలకు కాలేజీ ఎగ్గొట్టకూడదు. వెళ్ళమ్మా!" అన్నాడు ఆయన.

అయిష్టంగానే లేచింది శాంతి. గుమ్మందాకా వెళ్ళి ఆగి, మెడ కొద్దిగా వెనక్కి త్రిప్పి, "పరీక్ష లేకుంటే మటుకు మేడమ్‌ని పర్మిషన్ అడిగి వచ్చేస్తాను" అంది.

"అలాగే చెయ్! అన్నట్టు వెంకన్నతో ప్రిన్సిపాల్‌గారికి కబురు చేయడం మరవక!" అన్నాడు.

"అలాగే!" అంటూ అక్కడనుండి వెళ్ళిపోయింది శాంతి. శాంతి వెళ్ళిపోయిన తరువాత తిరిగి మంచంమీద వాలుతూ దీర్ఘమైన నిట్టూర్పు ఒకటి విరిచాడు. కళ్ళుమూసుకుని కొద్ది క్షణాలు గడిపాడు. అతని ప్రమేయం లేకుండానే అతని మనసు గతాన్ని నెమరు వేయ సాగింది.

"నల్లావు రేపో ఎల్లుండో ఈనడానికి తయారుగా ఉంది దొరా!" అన్నాడు పాలేరు భీముడు. చెంబు తీసికొని బావిమీద స్నానం చేయడానికి వెళ్తున్న త్యాగరాజశర్మ ఆగి, "అౌనురా భీముడూ! ఈ సారి దాన్ని ఆ పరమేశ్వరుడే రక్షించాలి!" అన్నాడు.

"ఏమో, ఆ దూకుడు గొడ్డు ఈసారి బ్రతుకుతుందనే ఆశ నాకైతే లేదయ్యా!" అన్నాడు భీముడు.

అతని మాటలనే మననం చేసుకుంటూ స్నానానికి వెళ్ళాడు త్యాగరాజశర్మ. త్యాగరాజశర్మగారి తండ్రిపేరు విధుమౌళి శాస్త్రిగారు. వారిది గంధర్వ వంశమని ప్రతీతి. వాళ్ళవంశంలో పుట్టిన వాళ్ళంతా అపూర్వ గాయకులు. అప్పుడే పుట్టిన పిల్లవాడు ఏడ్చినా సంగీతం పాడినట్లే ఉంటుందనీ, వాళ్ళ తాతల తరంనుండి అలాగే సంగీత కళోపాసకులని, ప్రజలనుడి. ఒక్క సంగీతమేగాక సంస్కృత భాషను కూడా అక్షరాభ్యాసంతో పాటు నేర్పడం వారింట్లో ఆచారంగా వస్తూంది. సంస్కృతమూ, సంగీతమూ, వాళ్ళింట్లో పోటీలు పడి నడయాడే లక్ష్మి సరస్వతులు.

అలాంటి వంశంలో పుట్టిన తన ఏకైక మగసంతానానికి సంగీత త్రిమూర్తులలో ముఖ్యులైన వాగ్గేయకారులు త్యాగరాజస్వామి పేరు పెట్టుకున్నాడు విధుమౌళి శాస్త్రి. పేరుకి తగ్గట్టుగానే ఆ పిల్లవాడు చక్కని గాయకుడై సంస్కృత విద్యలో కూడా పాండిత్యం సంపాదించాడు.

విధుమౌళి శాస్త్రి తన కుమారునికి వివాహంచేసిన ఎనిమిది నెలలకే కాలధర్మం చెందగా త్యాగరాజశర్మ తన కుమారునికి తండ్రి పేరు పెట్టుకున్నాడు. తనలాగే కుమారునికి చక్కని కంఠమూ సంస్కృత భాషాభిమానమూ చూసి ఈ రెండు విద్యలందు అతణ్ణి పండితునిగా చేయాలని సంకల్పించాడు త్యాగరాజశర్మ. పది సంవత్సరాలు కూడా నిండని ఆ పిల్లవాడు పాడుతూంటే, ఒక్కసారి ఆశ్చర్యపోయేవారు కూడా.

త్యాగరాజశర్మ కుటుంబీకులు అష్టయిశ్వర్య సంపన్నులు కారు. అలాగని కూటికి లేని పేదవారూ కారు. నైజాం నవాబుగారి తాత తాతగారి కాలంలో ఎప్పుడో విధుమౌళి తండ్రిగారి గానంవిని మెచ్చి ఆయనకు వ్రాసిచ్చిన జాగీరు కాలక్రమేణా కొంత పోగా మరి కొంత మిగిలింది. అదే గాక ఆరోజుల్లో జమీందారులనీ, దేశముఖ్‌లనీ రావుబహాద్దూర్‌లనీ, పిలువబడే కొందరు గ్రామపాలకులు స్థితిమంతులుగా ఉండటమే కాక ఊళ్ళో వారి మాటలకి ఎదురుండేదికాదు.

అలాంటి వారిలో కొందరు సంగీతమూ, కవిత్వమూవంటి కళలను పోషించేవారు. గానసభలు ఏర్పాటు చేయటమూ, కవులకి పోటీలు పెట్టి గెలిచినవాళ్ళకి బహుమతులు ప్రదానం చేయటమూ జరిగేది. అలాంటివాటిలో తరచుగా విధుమౌళిశాస్త్రి పాల్గొని ఎన్నో కానుకలను పొందేవాడు. ఆ సమయంలో కురికేళ అనే ఊరి జమీందారుగారు విధుమౌళి శాస్త్రి గాన మాధుర్యానికి మెచ్చి కొన్ని పంటభూముల్నీ, పాడి ఆవుల్నీ ఇచ్చాడు. ఆ నాటినుండి వారింట్లో గోసంపద పుష్కలమై పోయింది. వారింటికి ఎడమ వేపుగా పెద్ద పశువుల కొట్టం, దానినిండా ఆవులూ, లేగలూ, కోడెదూడలూ. కనులకింపుగా కనబడేవి. ఐతే విధుమౌళి శాస్త్రిగారి కాలంలోనే ఓసారి పశువుల రోగాలువచ్చి చాలామట్టుకు కాలగర్భంలో కల్సిపోయాయి. అప్పటి పశు సంపదకి చిహ్నంగా పెద్ద పశువుల కొట్టమూ, దాన్లో నాలుగు ఆవులూ, రెండు లేగలూ మిగిలిపోయాయి. వాటిలో చూపరులను ఆకర్షించే ఆవు నల్లావు. దాని ముఖంపైన అరచేతి వెడల్పులో ఉన్న తెల్లని మచ్చ, మిగిలిన శరీర భాగమంతా నల్లగా ఉన్నందుకు దిష్టిచుక్కలా అనిపించేది. లేగగా ఉన్నప్పటినుండి ఆ నల్లావు ఛెంగు ఛెంగున గంతులేస్తూ చలాకీగా ఉండేది.

అది పెద్దదై తొలి ఈతకు వచ్చింది. ప్రాణినుండి ప్రాణి వెలువడే ఘడియ అది. కేవలం మానవ జాతిలోనేగాక సృష్టిలోని ఎన్నో జన్మలు ఈ బాధలు తప్పుకోలేని స్థితి అది. మానవులకి నోరుంది. బాధలు చెప్పుకుని కాస్తలో కాస్త ఉపశమనం పొందుతారు. నోరులేని జీవాల మాటేమిటి?

'అంబా, అంబా!' అని అరుస్తూ పశువుల కొట్టం నిండా తిరిగింది నల్లావు. దాన్ని పట్టుకోవడానికి భీముడు వెళితే కుమ్మింది. బలవంతంగా కట్టివేస్తే కట్లు త్రెంచుకుంది. దాని అరుపులకు చుట్టు ప్రక్కలవారంతా వచ్చి చూపి ఇక బ్రతకదనే అన్నారు. హృదయ విదారకమైన అరుపులు నాల్గు గంటలు అరచి అరచి చివరకు ప్రాణం లేని దూడను కన్నది. అలాంటి నల్లావు ఇప్పుడు మళ్ళీ....స్నానం ముగించుకుని ఇంట్లోకి వెళ్ళుతున్న త్యాగరాజశర్మ ఇక ఆలోచించలేక

పోయాడు! 'భీముడు చెప్పింది నిజమే. ఈసారి అది బ్రతకటం కష్టం!' అనుకున్నాడు మౌనంగా.

భీముడు చెప్పినట్లుగానే ఆ తెల్లవారు ఝామున నల్లావు వేదన పడుతోంది. అది అంబాఅని అరుస్తుంటే తండ్రి వేలుపట్టుకుని వింతగా చూస్తున్నవిధుమౌళి ఏదో స్ఫురించిన వాడిలా చటుక్కున తండ్రి చేయి వదిలాడు. లోనికి పరుగెత్తాడు. ఆవుల పాకకి ఎదురుగా ఒక వేపచెట్టుంది. దాని మొదలులో ఇటీవలే త్యాగరాజశర్మ చిన్న అరుగు లాగా వేయించాడు. వేసవికాలంలో కాస్సేపు చల్లగాలికి కూర్చుంటారు దానిపై. ఎవరైనా వచ్చినపుడు కాసేపు పిచ్చాపాటీ మాట్లాడుకునేది కూడా ఆ అరుగుమీదే.

ఇంట్లోకి వెళ్ళిన విధుమౌళి వెంటనే తంబూరాతో తిరిగి వచ్చాడు. వేపచెట్టు నానుకుని ఉన్న అరుగుపై చాప పరిచాడు. తంబూరని తండ్రికి అందించి, "నాన్నా! 'నను పాలింపా నడచీ వచ్చితివో' అనే కృతి పాడరూ!" అన్నాడు.

కుమారునికి కల్గిన ఈ వింతకోర్కె త్యాగరాజశర్మకి ఆశ్చర్యం కల్గించింది.

"పాడండి నాన్నగారూ!" అన్నాడు అభ్యర్థిస్తున్నట్లు- ఆ పిల్లవాడు. ఏమనుకున్నాడో ఏమో, తంబూరానందుకుని మోహన రాగం ఆలాపించి, కృతిని పాడసాగాడు త్యాగరాజశర్మ.

అంతే! అంతవరకు నానా హంగామా చేసిన నల్లావు ఎవరో ఆపివేసినట్లు ఆగిపోయింది. చెవులు రెండు రిక్కించి కళ్ళింతవి చేసి, పరవశించి ఆ గానాన్నే వింటున్నది. దానికా క్షణంలో తన బాధా, వేదనా గుర్తు రాలేదు. ఆయన పాడుతున్నాడు. అది వింటోంది. అది వ్రాతలకందని మర్మం. అది వర్ణనకందని వైనం. సృష్టి వైపరీత్య మంతా సృష్టిలోనే దాగుందన్న పరమ సత్యం. పాడుతున్న త్యాగరాజశర్మగాని, వింటున్న గోవుగానీ ఈ లోకంలో లేరు. ఆనంద తీరాల్లో విహరిస్తున్నారు. తెల్లబోయి గుడ్లప్పగించి చూస్తున్నాడు భీముడు.

గానం ముగిసేవరకు 'అంబా!' అన్న లేగదూడ ఎప్పుడు భూమిపైకి వచ్చిందోగాని, నీ పాట నేనూ విన్నాననే భావం కన

బడిందా అరుపులో. అపుడే ఈ లోకంలోనికి వచ్చిన నల్లావు 'అంత బాధలోనూ ఇంత తియ్యదనముందా?' అన్నట్లుగా దూడ ముఖం తాకుతున్నది. తంబూరా క్రిందపెట్టి, కళ్ళు తెరచిన త్యాగరాజశర్మ నల్లావునీ, దూడనీ, చూసి సమస్తమూ అర్థం చేసుకున్నాడు.

ఆశ్చర్యం, ఆనందం, సంభ్రమం, సంతోషమూ, మరెన్నో భావాలు మిళితమైన తన్మయానంద డోలికల్లో ఊగిపోతూ కుమారుని వంక రెప్పవాల్చకుండా చూస్తూ ఉండిపోయాడాయన.

'శిశుర్వేత్తి-పశుర్వేత్తి-వేత్తి గాన రసః ఫణిః' అన్నారిందు కేనా? అది నిజమని నిరూపించేందుకేనా త్రాడుకి కట్టుబడని పశువు తన పాటకి కట్టివేసినట్లు ఆగింది? అది ముందుగా తన కుమారుని కెలా తెల్సింది? ఎంత విచిత్రం!' ఆశ్చర్యం అవధులు దాటగా విస్తు పోతున్నాడతను. వెంటనే కొడుకునెత్తుకుని శిరస్సుపై ముద్దు పెట్టు కుంటూ, 'ఇన్నేళ్ళుగా సంగీత సాధన చేస్తున్నా—నాకు స్ఫురించని విషయం నీవు గ్రహించావు. నిన్ను కన్నందుకు నేనే ధన్యుడిని!' అనుకున్నాడు మనసులో.

* * *

వేసవి కాలం. అర్థరాత్రి సమయం. పిండారబోసినట్లుగా పండు వెన్నెల కాస్తోంది. వెన్నెల్లో మంచంమీద వెల్లకిలా పడుకుని ఆలోచిస్తున్న త్యాగరాజశర్మ మెల్లిగా "జయా! నిద్రపోతున్నావా?" అన్నాడు.

అతని మాటలకు చిన్నగా చిరునవ్వు నవ్విన ఆమె— "లేదండీ! నిద్ర ఎలా వస్తుంది? నా స్వామికి జరిగిన సన్మానం గురించి అందరూ చెప్పుకోగా విన్న నేను అదంతా నా కళ్ళ ఎదుట జరిగినట్లు ఊహించుకోవడంతోనే సరిపోతున్నది. నా ఆనందం పంచుకోవడానికి మిమ్మల్ని లేపుదామనుకున్నాను. కాని ఉదయం నుండి ఎందరి దిష్టోపడి, ఎందరి చూపో సోకి, అలసిపోయి ఇప్పుడే నిద్రపోతున్న మిమ్మల్ని చూసేసరికి లేప బుద్ధికాలేదు. నిజంగా ఈ రోజు నాకు ఎంత మంచిరోజో చెప్పలేను" అంది.

"నిజమే జయా! ఈరోజు చాలా మంచిరోజు. కురికేశలో జమీందారుగారు ఏర్పాటు చేసిన సంగీత పోటీలో నేను నెగ్గినందుకు

నాకు సన్మానం చేశారు. ముఖ్యంగా 'జగన్మోహిని రాగం వినాలంటే జగన్మోహనంగా పాడగలవారు త్యాగరాజశర్మగారే!' అంటూ జమీందారుగారు ఎంతగానో నన్ను ప్రశంసించారు. సన్మానాలు నాకు క్రొత్త కాకపోయినా ఈ స్వర్ణ కంకణం నాచేతికి తొడిగించుకోవడం మాత్రం ఇదే ప్రథమం కదూ! పట్టు ధోవతి, కండువతో సత్కరించారు. ఇది నిజంగా నేను మరువలేని రోజు!" అన్నాడు త్యాగ రాజశర్మ.

అతని మాటలకు ఆనందం పొంగుకురాగా, తన మంచంమీద నుండి లేచి ఆయన మంచంవద్దకు వెళ్ళింది జయ. మంచంపై కూర్చొని అతని ఛాతీపై తలపెట్టి, "మీకు కాదు, మన కుటుంబానికంతకూ ఈ రోజు ఎంతో విలువైనది" అంది.

"అవును జయా! నాకున్నదెవరు, మీరిద్దరే కదూ! ఇదంతా ఆ పరమేశ్వరుని కృపా, మీ ఇద్దరి అదృష్టమూను" అన్నాడు.

"మాదేముంది? సంగీత కళామతల్లికి సేవచేసినవారు మీరు. ఫలితం కనిపిస్తే అది మీ కృషిఫలితమేగాని, మా అదృష్ట ప్రసక్తి లేదు" అందామె.

"అలా అనకు జయా! నీవేగనక నా భార్యవి కాకుంటే నా సాధనకింత ప్రోత్సాహం లభించేది కాదు. నీవు నా అదృష్టరేఖవీ, ఆశాజ్యోతివీ, శృంగారదేవతవీనూ!" అన్నాడు త్యాగరాజశర్మ ఆమెని దగ్గరగా తీసుకుంటూ.

"అబ్బో! అబ్బాయిగారు సంగీతప్రియులే ననుకున్నాను గాని, రసికప్రియులు కూడానూ!" అంది జయ చలాకీగా నవ్వుతూ.

"మరేమనుకున్నావ్! అందుకేగా ఎందరో కన్నెపిల్లలు నాపై వల విసిరితే, నేను ఈ అందాలరాశిపై వల విసిరాను" అన్నాడామెని తదేకంగా చూస్తూ. వారిద్దరి అన్యోన్యం చూసి సిగ్గుపడి కాబోలు చంద్రుడు మబ్బుల్లో దాక్కున్నాడు.

* * *

తెల్లవారుఝామున నాల్గు గంటలైంది. ప్రతిరోజూ ఆ సమయానికే త్యాగరాజశర్మ లేచి సంధ్యానుష్టాన కార్యక్రమాలు ప్రారంభించుతాడు.

చెరువుకి వెళ్ళి స్నానంచేసి, దేవుడిముందు కూర్చుంటే తిరిగి తొమ్మిదిగంటలకే లేవటం. కానీ, నిన్నటిరోజున సంగీత సభలో చాలా అలసిపోయి ఉన్నాడుగనుక మెలకువ రాలేదు. జమీందారుగారి ఊరు అక్కడికి ఆరుమైళ్ళ దూరాన ఉండటాన ఇంటికి వచ్చేప్పుడు కూడా రెండెడ్ల బండిపై ప్రయాణమూ, రాత్రి ఇంటికి వచ్చిన తరువాత ఊళ్ళోవారి ప్రశంసలందుకుని, తిని పడుకునే సరికి రాత్రి కావటమూ, మళ్ళీ మధ్యలో లేవటమూ, వీటన్నింటి మూలానా ఎన్నడూ లేనిది ఆవేళ ఆదమరచి నిద్రిస్తున్నారు.

అంతలో ఏదో కుడిచేతిమీద పాకినట్లు కావడంతో దిగ్గునలేచి, "ఎవరదీ" అన్నారు.

కాని అప్పటికే జమీందారు త్యాగరాజశర్మకి నిన్నటిరోజున ప్రదానం చేసిన కంకణ మందుకుని దొంగ పరుగెత్తుతున్నాడు. దొంగ పరుగెత్తినప్పటి అడుగుల చప్పుడూ, భర్త కంఠమూ, విని లేచిన జయ విషయమంతా గ్రహించి, "దొంగ-దొంగ-పట్టుకోండి" అంటూ అరిచింది.

అదే సమయంలో పాలు పితకడానికి వస్తున్న భీముడు తన కెదురుగా కంకణం పట్టుకుని వస్తున్న దొంగని వెన్నెట్లో స్పష్టంగా చూడగల్గటమేగాక, జయ అరుపులు కూడా విన్న తరవాత తన అనుమానం దృఢపడి దొంగరెక్కని బలంగా ఒడిసిపట్టుకున్నాడు.

అతని పట్టునుండి తప్పించుకోలేక దొంగ గిజగిజలాడుతున్నాడు. అంతలో భీముడి అరుపులకు చుట్టుప్రక్కల వారంతా లేచి వచ్చారు. క్షణంలో విషయం ఊరంతా ప్రాకింది. ఈలోగా తెల్లవారింది. ఊళ్ళోని కరణం, మున్సబు మొదలైన వారంతా వచ్చారు. దొంగని ఒక చెట్టుకి కట్టేశారు. తన్నాలని ఒకరూ, చంపాలని ఒకరూ, ఈసారి దొంగతనం చేయకుండా వాతలు పెట్టి వదలాలని మరొకరూ, జైల్లో పెట్టించాలని మరొకరూ, ఎవరికి తోచిన రీతిగా వాళ్ళు సలహాలిచ్చి తమ కక్షనంతా మాటలద్వారా తీర్చుకుంటున్నారు.

"కంకణం దొరికిందిగదా అతన్ని విడిచి పెట్టండ"ని చెప్పి స్నానానికి వెళ్ళిన త్యాగరాజశర్మ విడిచిపెట్టారనే అనుకున్నాడు. ఆ రోజు కొంచెం ఆలస్యంగానే చెరువునుండి ఇంటికి వచ్చారు.

ఆయన వచ్చేసరికి ఇంటిముందు కరణంగారూ, మరికొంత మంది పెద్దమనుషులూ కూర్చుని ఉన్నారు. ఇంకా చాలామంది ఉన్నారు. కరణంగారు గొంతు సవరించుకుని, "యాభై కొరడా దెబ్బలు కొట్టి విడిచిపెట్టండి. జన్మలో మళ్ళీ దొంగతనం చేయడు!" అని అంటున్నాడు.

ఆ ఊరి ప్రజలకు కరణంగారి మీద చాలా గురి. చిన్నా పెద్దా తగవులకు ఆ ఊరి వారికి అప్పట్లో ఆయన తీర్పే తిరుగులేనిది. అసలింతసేపూ దొంగ ఒంటిమీద ఒక్కరు కూడా చేయి చేసుకోక పోవడానికి కూడా కరణంగారేమంటారోనన్న భయం ఉండటమే కారణం.

కరణంగారి మాటలు విన్న ప్రజలు ఒక్కుమ్మడిగా లేచారు. దొంగని తలా ఒక దెబ్బ వేయ నిశ్చయించుకున్నట్లుగా ఉంది వారి ప్రవర్తన. తన పైకి మూకుమ్మడిగా వస్తున్న ప్రజలని చూసి దొంగ రెండు చేతులెత్తి నమస్కరించాడు. కాళ్ళు చేతులు గింజుకుంటున్నాడు.

ప్రజలు మాత్రం ఎవరికి తోచిన బండబూతులు వాళ్ళు తిడుతూ దొంగపైకి వస్తున్నారు. ఈ పరిస్థితుల్లో అక్కడికి వచ్చిన త్యాగరాజశర్మ హఠాత్తుగా దొంగకడ్డం వెళ్ళి నిల్చున్నారు.

ఈ హఠాత్సంఘటనకి అందరూ దిగ్భ్రాంతులయ్యారు. వెనుకంజ వేశారు.

ఉద్రేకం చల్లబడిపోగా ఆశ్చర్యంగా చూస్తున్న వాళ్ళందర్నీ ఉద్దేశించి, "అయ్యల్లారా! అతన్నేమీ చేయకండి. నా వస్తువేదో నాకు దొరికింది గదా! అతని తరఫున నేను మీ అందరికీ క్షమాపణలు చెప్పుకొంటున్నాను" అని కరణంగారి వద్దకువెళ్ళి, "కరణంగారూ! వస్తువు పోయింది నాది కదా! నాది నాకు దొరికింది. అందుకని దొంగను శిక్షించాలనే ఉద్దేశ్యం నాకు లేదు. దయచేసి నా కోరికను మన్నించి అతణ్ణి విడిపించండి!" అన్నాడు.

కరణంగారు ఏమనుకున్నారో ఏమో, తలాడిస్తూ, "మంచిది శర్మగారూ! అలాగే కానివ్వండి. కాని ఇతను ఈ వూళ్ళో మరే దొంగతనమూ చేయకుండా చూడవల్సిన బాధ్యత మీమీద వుంటుంది.

అందుకు మీరు ఒప్పుకుంటేనే ఇతణ్ణి విడిచేది. మీ ఇష్టం. ఆలోచించుకొని అందుకిష్టమయితేనే దొంగని విడిపించుకోవచ్చు" అన్నాడు.

త్యాగరాజశర్మ సరేనని తలాడించిన తరువాత కరణంగారు అందరినీ వెళ్ళవల్సిందిగా హెచ్చరించి తనూ వెళ్ళిపోయాడు. త్యాగరాజశర్మను అదో మాదిరిగా చూస్తూ వూరందరూ వెళ్ళిపోయారు.

అంతా వెళ్ళిపోయిన తరువాత దొంగకి కట్టిన కట్లు భీముడి సహాయంతో వూడదీసాడు త్యాగరాజశర్మ. కట్లు విప్పగానే త్యాగరాజశర్మ పాదాలపై వాలిపోయాడు దొంగ. "ఈరోజు నాకు తమరు పేణదానం సేసారు. మీరు బగమంతుడు. కాదు, కాదు- అంతకన్నా ఎక్కువోరు. మీకు నేను అపకారం సెయ్యబోతే నాకు మీరు ఉపకారం సేసారు" అంటూ భోరుమని ఏడ్చాడు.

మధ్యాహ్నంవరకు తనింట్లోనే వుంచుకొని తమతోపాటూ దొంగకీ భోజనం పెట్టించాడాయన. ఆవురావురుమంటూ అన్నం తింటున్న దొంగని చూసి చాలా జాలి కలిగిందాయనకి. కడుపు నిండుగా అన్నం పెట్టించి తీరికగా తన దగ్గర కూర్చోబెట్టుకొని అన్ని విషయాలు అతన్నుండి మెల్లగా రాబట్టాడు త్యాగరాజశర్మ.

ఆ దొంగదో పల్లెటూరు. అతనికో కొడుకుండేవాడు. అతని భార్య చక్కని చుక్క. కూరగాయలమ్ముకుని బ్రతికేవాడతను. ఓ రోజు కూరలమ్ముకుని ఇంటికి వచ్చేసరికి భార్యా, కొడుకూ చచ్చిపడి ఉన్నారు. అది అతని భార్యపై కన్నువేసిన ఒక భూకామందు పని అని తెల్సి కూడా ఏమీచేయలేక పిచ్చెత్తి నట్లయిపోయాడు. పగ, ద్వేషం రెచ్చగొట్టగా, ప్రజలపై కోపం ద్వేషంగామారి, ఆ ద్వేషం తీర్చుకోవడానికి ప్రజలను దోపిడీచేస్తూ దొంగగా మారిపోయాడు.

అతని కథంతా విన్న త్యాగరాజశర్మ, "మరి ఈ వూళ్ళో నీకు అపకారంచేసిన వాళ్ళు లేరు కదా! ఇక్కడెందుకు దొంగతనానికి పాల్పడ్డావు?" అని అడిగాడు.

అందుకా దొంగ, "అయ్యా! ఇంతవరకూ నేను చిన్న చిన్న దొంగతనాలు చేసానుగాని హత్యలు చేయలేదు. నిన్న జమీందారుగారు మీకు బంగారు గాజు ఇచ్చారని తెలిపింది మా

వూళ్ళో. 'అదిగనక కాజేస్తే జీవితాంతం దొంగతనం సెయ్యకుండా బతుకు గడచిపోద్ది!' అనుకున్నానయ్యా! ఎందుకంటే దొంగతనం సేసి సేసి ఇప్పటికే ఇసుగొచ్చిందయ్యా! ఇక దొంగతనాలు మానుకుందా మనుకున్నానయ్యా! దొంగనైన నాకు ఎవ్వరూ పనియ్యరు. తిండి కావాలికదయ్యా! మీ గాజుగనక తీసుకుపోతే ఇక జీవితాంతం గడిచి పోద్దనుకుని ఆ పని సేసినానయ్యా!" అన్నాడు.

అందుకు త్యాగరాజశర్మ, "తిండికైతే నీవు ఇంక ఎక్కడికీ వెళ్ళనక్కర్లేదు. మా ఇంట్లో ఇంతతిని నీకు చాతనైన పనిచేస్తూ ఇక్కడే వుండిపో! నా బొందిలో ప్రాణమున్నంతవరకు నిన్ను కాదనను. అలాగాక నీకు దొంగతనమే ఇష్టంగా ఉన్నట్లయితే-ఇదిగో ఇదితీసుకొని తక్షణం ఈ వూరు వదలిపెట్టి పో! మళ్ళీ ఈ వూళ్ళో అడుగుపెట్టావంటే ఈ వూరి ప్రజలు నిన్ను ప్రాణాలతో విడవరు" అంటూ కంకణం దొంగచేతి కీయబోయాడు.

అతని మాటలకు దొంగ ఒళ్ళువెల్లా కంపించుతూ అతనికి రెండు చేతులెత్తి నమస్కరించి, "అయ్యా! దొంగతనంలో వున్న గౌరవమేదో ఈనాడు ప్రత్యక్షంగా తెలుసుకొన్నాను. పేణంపోయినా ఇకముందు దొంగగా బతకను. రెండు ముద్దలు పెడతానంటున్నారు. తిని తమ కాళ్ళకాడ కుక్కలా పడుంటానయ్యా! పిటికలో తమరి పనులన్నీ సేసిపెట్టగలను బాబయ్యా!" అన్నాడు.

జయా, భీముడూ, ఊరివాళ్ళూ ఎందరో వద్దని చెప్పినా మానవత్వం మీద నాకు నమ్మకముందంటూ ఆ దొంగకి ఆశ్రయ మిచ్చాడు శర్మ. ఆ దొంగ పేరు వెంకన్న.

'వెంకన్నకి ఆశ్రయమివ్వటంలో తొందరపడ్డానేమో' అని మొదట్లో త్యాగరాజశర్మ భావించినా, ఆ తర్వాత వెంకన్న ప్రవర్తన ఆయనకేగాక ఆ ఊళ్ళో మరెవరికీ పాత వెంకన్నని గుర్తుకి తేలేదు. రాను రాను ఇంట్లో వారికేకాక ఊళ్ళో వారికే నోట్లో నాలుకయ్యాడు వెంకన్న.

* * *

"జయా! నరసింహపురినుండి దొరగారు (కొన్ని వూళ్ళలో దేశ్‌ముఖ్‌లని, దొరలని పిలవడం నేటికి కూడా కద్దు) కబురు

పంపించారు. వారి కూతురు పెళ్ళికి నా కచ్చేరి ఏర్పాటు చేయిస్తానని లోగడ ఎప్పుడో నాతో అన్నారు. నిన్న పెళ్ళయిందట. ఈరోజు రమ్మని కబురు చేసారు- వెళ్ళివస్తాను" అన్నాడోరోజు ఉదయం త్యాగరాజశర్మ భార్యతో.

ఆమె ఆశ్చర్యపడి, "నరసింహపురా? అదంతా చిట్టడవి. అక్కడికెలా వెళతారు?" అంది.

త్యాగరాజశర్మ చిన్నగా నవ్వి, "భయపడకు! బండి పంపించారులే! వెళ్ళి త్వరగా వచ్చేస్తా!" నని చెప్పి వెళ్ళాడు. దొరవారి ఇంట్లో కచ్చేరి ముగించుకొని తిరిగి తన వూరు బయల్దేరాడు. దొర గారి బండిలో తన ఊరి పొలిమేరకు వచ్చి అక్కడినుండి తను వెళ్ళగలనని చెప్పి తంబూర వుంచిన పెట్టెతోసహా దిగి బండిని వెనక్కి పంపించాడు. తను వూళ్ళోకి నడుస్తున్నాడు.

సూర్యుడు పశ్చిమదిశలో శయనించడానికి ఉబలాటపడుతున్నాడు. మేతకొరకు వెళ్ళిన పక్షులు, రెక్కలురాని పిల్లలకొరకు ఆరాటపడి త్వరగా గూళ్ళు చేరుకొంటున్నాయి. రాత్రి పగలుని మింగివేయాలని, పగలు రాత్రిని జయించాలని ఆరాటపడి రెండూ దోబూచులాడుతున్న వేళ అది. సన్నని పిల్లగాలులు వీస్తున్నాయి.

త్యాగరాజశర్మ ఆనందంతో నడుస్తున్నాడు. ఆ ఆనందంతో చిన్నగా కూనిరాగం తీస్తూ నడుస్తున్నాడు. అలా తన్మయత్వంతో పాడుతూ నడుస్తున్న శర్మకి ఏదో అనుమానం కలిగింది. పాట ఆపకుండా పాడుతూ నడుస్తూ మెడని కుడిచేతివేపు కొద్దిగా త్రిప్పి ఓరకంటితో వెనక్కి చూసాడు.

అతని గుండె 'ఝల్లు' మంది. అతని వెనకాల గజన్నర పొడవులో వున్న నాగుపాము ప్రాకుతూ వస్తున్నది. 'దానికీ తనకీ ఎంతో దూరం లేదు. అది తన పాటవింటూ తనని వెంబడించిందనీ, గానంలో లీనమైన ఆ పాము ఏ క్షణంలో తాను పాట ఆపితే ఆ క్షణంలో కాటు వేయగలదని' త్యాగరాజశర్మ గ్రహించాడు.

అతని కాళ్ళు తడబడుతున్నాయి. నడక సన్నగిల్లింది. క్రమంగా అతని పాదాలు శక్తిని కోల్పోయినట్లయి మెల్లిగా పడే అడుగులు ఓ చోట ఆగిపోయినాయి. 'ఇంక తన పని ఐపోయింది,

నడక ఆగిపోయింది. పాము తనని తప్పక కాటు వేస్తుందీ నిముషం లోనే' అనుకొంటున్నాడు త్యాగరాజశర్మ.

కాని పాట మాత్రం ఆపకుండా అలా అలా పాడుతూనే వున్నాడు. ఎంతసేపటికీ పాము తనని కాటు వేయకపోవడంతో ఇందాకటిలాగే మెడ కొద్దిగా త్రిప్పి చూసాడు త్యాగరాజశర్మ. ఈ సారి మరింత ఆశ్చర్యానికి లోనయ్యాడతను. వెనక ఆయన కుడి కాలికి జానెడు దూరంలో ఆ పాము పడగవిప్పి ఆడుతోంది.

'తను నడక ఆపి మరింత పొరపాటు చేసాడు. ఇప్పుడు నడవ డానికి కూడా లేదు.' మనసుతో ఆలోచిస్తూ నోటితో పాటపాడుతూ అయోమయంలో పడిపోతున్న త్యాగరాజశర్మకి సాక్షాత్కరించిన పరమేశ్వరుడులా భీముడు వస్తూ కనిపించాడు. పాట ఆపకుండా, రాగం మార్చకుండా, తాళం పోకుండా అదే రాగంలో పాటలా—
"భీముడూ! నన్ను చూడరా! భీముడూ నన్ను చూడరా!" అంటూ పాడుతూ అలాగే నిల్చుండిపోయాడు. దూరంనుండి వస్తున్న భీముడికి అర్థం కాలేదు మొదట్లో.

కాని దూరం తరిగి త్యాగరాజశర్మకి దగ్గరౌతున్నకొద్దీ విషయ మంతా అర్థం చేసుకొన్నాడు భీముడు! కొంచెం దూరంలో నుండి ఆయన పాడుతుండటమూ, పాము ఆయనకు దగ్గరగా ఆడుతుండ టమూ చూచి ఒక్క క్షణం ప్రపంచంలోని వింతలన్నీ అక్కడే వున్నట్టు ఆశ్చర్యంగా చూసాడు భీముడు.

అవును మరి! అలాంటి దృశ్యమే.

ఆత్మకూ పరమాత్మకూ, జీవికీ జీవితానికీ, సృష్టికీ ప్రకృతికీ ఉన్న సత్సంబంధమే సంగీతానికీ మనుగడకీ మధ్య వుందని తెల్పే మంజుల మనోహర దృశ్యకావ్య మది ఒక్క మానవజాతినేగాక పశు పక్ష్యాదులనూ, క్రిమి కీటకాదులనూ కూడా ఆకర్షించిన ఒకే ఒక్క లలితకళ సంగీతమేనని నిరూపించే యదార్థ చిత్రమది.

క్షణం తన్నుతాను మరచి చూసిన భీముడు వెంటనే కర్తవ్యం స్ఫురణకు రాగా చేయవలసిన పని గురించి అరనిముషం ఆలోచిం చాడు. వెంటనే తన తలపాగా ఊడదీశాడు. అది నడుముకి చుట్టు కుని ధోవతీ ఊడదీశాడు, దాన్ని నాలుగు మడతలుగా మడచి, అడు

గులో అడుగు వేసుకుంటూ ఆనందంగా నాట్యం చేస్తున్న నాగుబాము వెనకనుండి దగ్గరగా వెళ్ళాడు. పాముకి అరగజం దూరంలో నుంచుని తన ధోవతీని పాము శిరస్సుపై పడేట్టు విసిరాడు.

ఐతే చివరి క్షణంలో అడుగుల సవ్వడికి హఠాత్తుగా వెను దిరిగిన పాము పడగ అలాగే ఎత్తి భీముడి కాలుమీద కాటువేయ టమూ, భీముడి చేతిలోని పంచెపాము మీద పడటమూ, ఒకేసారి జరిగాయి. పాము పంచెక్రిందా భీముడు నేలమీదా ఒకేసారి పడ్డారు. త్యాగరాజశర్మకి గండమైతే తప్పింది కాని, భీముణ్ణి మాత్రం ఆయన మృత్యువునుండి కాపాడలేక పోయాడు. భీముడు క్రిందపడిన మరు క్షణం అంతవరకూ పాముకొరకై పాడుతున్న పాటని ఆపివేసి, నల్గురినీ కేకవేసి, వాళ్ళసహాయంతో ఊళ్ళోని వైద్యుడి దగ్గరకు తీసుకు వెళ్ళాడు. ఆ వైద్యుడు తనవల్లకాదంటే బస్తీకికూడా తీసుకు వెళ్ళాడు. కాని అక్కడ వైద్యం మొదలు పెట్టకముందే శరీరమంతా నల్లగా కమిలిపోగా నురగలు కక్కుతూ ప్రాణాలు వదిలాడు. అతను చనిపోయేముందు చేతులు జోడించి అతిప్రయాసగా అన్న మాటలివి. "రత్తాలు-పెళ్ళి."

రత్తాలు భీముడి కొక్కతే కూతురు. రత్తాలు తరువాత భీముడి భార్య మళ్ళీ పురిటినీళ్ళు పోసుకోలేదు. ఒక్కతే సంతానమైన రత్తా లుని భీముడు దంపతులు పంచ ప్రాణాలతో పెంచుకుంటున్నారు. అన్యోన్యంగా ఉండే ఆ దంపతులకి రత్తాలు పంచప్రాణాలు. ఉన్న దాంతో తృప్తిపడి, సంతృప్తికరమైన జీవితం గడుపుతున్న భీముడి కుటుంబానికి, అతడిమరణం శరాఘాతమే అయ్యింది. త్యాగరాజశర్మ ఎంతగానో దుఃఖించాడు. తన ప్రాణాలు నిలపడానికి భీముడు ప్రాణం పోగొట్టుకున్నాడు. ఇదంతా తను పాడిన పాటవల్ల కలిగిన ఫలితం. తన గానంవల్ల భీముడి మరణం ప్రశాంతంగా సాగే తన గాన మాధు రిలో అపశృతి దొర్లటమేమో ననే శంకకు అంకురార్పణమైంది త్యాగరాజశర్మలో.

భీముడు మరణించిన తరువాత అతడి కుటుంబానికి కావల్సిన సదుపాయాలన్నీ త్యాగరాజశర్మే చూడసాగాడు. అది తన కర్తవ్యంగా భావించాడాయన. త్వరలో రత్తాలు పెళ్ళికూడా చేయాలని సంకల్పిం

చాడు. కాని పరమేశ్వరుని సంకల్ప మెలా ఉందో ఎవరు తెల్సుకో గలరు?

అది వర్షాకాలం కావడంతో ఒకరోజు వచ్చిన ఉధృతమైన గాలివాన కారణంగా భీముడి గుడిశ కాస్తా గాలికి లేచిపోయింది. ఇల్లంతా తడిసి ముద్దయింది. ఇంటినిండా నీళ్ళు. పైన కప్పులేదు. తల్లీ కూతుర్లిద్దరూ ఆ రాత్రి తెల్సిన వారింటిలో తలదాచుకున్నారు. తెల్లవారిన తరువాత ఆ విషయం తెల్సిన త్యాగరాజశర్మ వాళ్ళని తన ఇంటికి తీసుకువెళ్ళాడు. తన ఇంట్లో గొడ్లచావడి చాలామట్టుకు ఖాళీగా ఉండటంతో అక్కడే ఆ తల్లీ కూతుళ్ళకి చిన్న పాకలాగా వేసి అందులో ఉంచేద్దా మనుకున్నాడు. పాక వేసేందుకు పనివాళ్ళని పిలచి మాట్లాడుతూండగా ఈ విషయం విన్నవాళ్ళెవరో ఆ వార్తని ఊళ్ళోకి చేరవేశారు. వెంటనే హుటాహుటీగా బ్రాహ్మణులంతా కరణం గారిని వెంటపెట్టుకుని అక్కడికి వచ్చారు. ఆ ఊరిలో బ్రాహ్మణుల వీధిలో మరే ఇతర వర్ణాలవారిల్లు లేదు బ్రాహ్మణుల వీధిలో ఇతర కులాలవారిని తెచ్చి పెడతారా? అందుకు మేము వప్పుకోమని నానా రభసా చేశారు. శర్మ ఎంతగా చెప్పినా ససేమిరా వీల్లేదన్నారు.

కరణంగారు కూడా-"ఔను శర్మగారూ! మన పూర్వీకులు ఏ కులాలవారిని ఆయాస్థలాల్లో ఉండేటట్టు మన ఊరిని నిర్మించారు.ఇపుడు తెల్సిన వారూ పండితులూ మీరే నడత తప్పితే-అది ముందుతరాలకు ఆచరణీయమౌతుంది. కనుక మీరు మరెక్కడైనా స్థలం తీసుకుని వాళ్ళకి ఇల్లువేసి ఇవ్వండి. అభ్యంతరం లేదు." అన్నాడు.

"మీరుచెప్పింది బాగానే ఉంది. కాని వేరే స్థలం కావల్సిన అవసర మేముంది? రత్తాలు పెళ్ళిచేసి ఆమెనొక ఇంటిదాన్ని చేసిన తరువాత భీముడి భార్య ఒక్కత్తి ఉండాలి గదా? అలా కష్టసుఖాల్లో దిక్కులేక వంటరిగా ఉండటంవల్ల ఆమె వేదన మరింత ఎక్కువౌతుంది. మాతోపాటు మాప్రక్కనే ఉంటే తనకు తోచిన పనిచేస్తూ ఇంట్లో ఆడవాళ్ళకి కూడా తోడుగా ఉంటుంది."

"అవును! మీకూ అంత దూరం తరచూ వెళ్ళివచ్చే శ్రమా తప్పుతుంది సులువౌతుంది" అన్నారొకరు వ్యంగ్యంగా. కాని ఆ వ్యంగ్యాన్ని అర్థంచేసుకోలేని త్యాగరాజశర్మ మటుకు—

"అవును! చక్కగా చెప్పారు. తరచూ వాళ్ళ కష్టసుఖాలు కనుక్కోవడానికి అంత దూరం వెళ్ళాలంటే నాకూ ఇబ్బందిగానే ఉంది" అన్నాడు. ఐనా అతని మాటని ఎవరూ సాగనియ్యలేదు. చివరకు అందరూ కల్సి తేల్చిందేమంటే- భీముడి కుటుంబం వీరింటి వద్ద వుండడానికి వీలులేదని.

కరణం కూడా తన నిర్ణయం అదేనన్నట్లు తలాడించాడు. అందుకు గరళం మ్రింగిన పరమశివుడులా అయిపోతూ త్యాగరాజ శర్మ—

"ఐతే నా నిర్ణయం కూడా వినండి! నా మూలంగా మగ దిక్కని కోల్పోయిన ఆ సంసారాన్ని నడిఏటిలో పడవలా విడిచేది లేదు. రత్తాలు యవ్వనంలో ఉన్నపిల్ల. భీముడి భార్య ఆడ మనిషి. ఈ పరిస్థితిలో వారి కుటుంబానికేదైనా ఆపద సంభవిస్తే పరలోకంలో ఉన్న భీముడి ఆత్మేగాక, నా అంతరాత్మ కూడా నన్ను క్షమించదు. మీ కట్టుబాట్లు, మీరు నాకొరకు వీడనక్కరలేదు. రేపే నేను ఈ ఇల్లు బేరం పెట్టి ఎంతకో ఒకంతకు ఇంటినమ్మి భీముడి కుటుంబం, నా కుటుంబంతో సహా వేరే చోటుకి వెళ్ళిపోతాను. అంతవరకు మాత్రం ఓపిక పట్టండి!" అన్నాడు.

అతని నిర్ణయం విన్నవాళ్ళంతా ఆశ్చర్యపోయారు.

"ఆఖరుకు కులంగాని వాళ్ళకొరకు ఊరుకూడా వదలి వెళ్ళి పోతావన్న మాట!" అన్నాడు భానుశాస్త్రి అనే అతను.

త్యాగరాజశర్మకి ఒళ్ళు మండిపోయిందీ సారి— "ఏమి టండీ, కులం కులమని మీరు చాలాసేపట్నుండి గొంతు చించు కుంటున్నారు? మీరు నిత్యం పూజించే కృష్ణపరమాత్మదే కులమండీ? పతివ్రతగా పేరెన్నికగన్న అరుంధతీదేవిది ఏ కులమో చెబుతారా? యుగ యుగాలకీ ఆదర్శప్రాయుడైన శ్రీరామచంద్రుడు ఎంగిలి పండ్లను తిన్నది ఏ కులంవారివద్దో శలవిస్తారా?"

"వాళ్ళంతా గొప్పవాళ్ళు, పురాణ పురుషులు!"

"ఓహో! ఐతే నేనిప్పుడు వాళ్ళనే అనుసరిస్తే- రాబోయే తరాలకు నేనూ గొప్పవాణ్ణీ, పురాణ పురుషుణ్ణీ ఔతానుగదూ! చూడండి భానుశాస్త్రిగారూ! కులమనేది మనిషి పుట్టకముందే దేవుడు

నుదుట వ్రాసిన గీతకాదు. చేసే వృత్తులను బట్టి మానవులు నిర్ణయించుకున్న ఒక నీమం అది. నిశ్చయంగా ఇది నిజం. ఈ నిజం ఈనాడు గాకున్నా రేపైనా ప్రజలకు అవగతం కాగలదు. అలా జరిగిననాడు, ఈరోజు మనం నిర్మించుకున్న ఈ ఇనుప గోడల్ని బద్దలుకొట్టి అనంత ప్రజావాహిని లోనికి చొచ్చుకుని వచ్చిననాడు నేటి వారి స్థితే రేపటికి మనకు గతి. ఇది హృదయ పూర్వకంగా నేను చెబుతున్న సత్యం."

అతని మాటలకు భానుశాస్త్రి హేళనగా నవ్వి, "భలే! చాలా గొప్పగా చెప్పానని అనుకుంటున్నావు. కాని అదంతా పుస్తకాలమీద వ్రాయడానికి, వేదికలెక్కి ఉపన్యసించడానికే పనికి వస్తుంది. కాని ఆచరణలో పెట్టడానికి తరాలెన్నో మారాలి."

"అవసరం లేదు. అలాంటి రోజు అతి త్వరలో రాబోతూంది. మీరూ, నేనూ అందరూ మారాలి. తప్పదు."

"ఓహో! పెద్ద సంస్కర్త బయలుదేరాడండీ! కులంలేదుట. కులం లేదూ? అలాంటప్పుడు ఈ విభూధిరేఖలూ, ఈయజ్ఞోపవీతమూ ఈ సంధ్యావందనమూ, ఈ మడీ, ఈ దేవతార్చనా, ఈ ఆచారాలూ, అన్నీ దేనికి? అవన్నీ తీసేసి సంఘ సంస్కర్తనని ఫలకం తగిలించుకు తిరగరాదూ?" అన్నాడు భానుశాస్త్రి ఉద్రేకపడుతూ. అతని అమాయకత్వానికి నవ్వినట్లు ఆవేశం కరిగిపోగా చిరునవ్వు నవ్వుతూ-

"మీరు నా మాటల్ని పొరపాటుగా అర్థం చేసుకున్నారు. మనిషిని మనిషి అంటకూడదనే నీమం పనికి రాదన్నాను. కాని నేను కులవృత్తి మానమనడం లేదు. వంశంలో ఉన్న విద్యని విడవమనడం లేదు. ఇంక నా విషయంలో నంటారా? నా వంశం వారంతా ఏ విద్య మీద ఆధారపడి బ్రతికారో నేనదే విద్యతో బ్రతుకుతున్నాను. ఒకవేళ ఈ విద్య నాకేనాడైనా కూడూ గుడ్డా పెట్టలేకపోతే మీరన్నట్టు వేరే వృత్తి తప్పక స్వీకరిస్తాను. ఇక విభూధిరేఖలూ, మడీ, ఆచారమూ, వీటన్నిటినీ పరిశుభ్రత కొరకూ ఆరోగ్యం కొరకూ, దేవుని ధ్యానించడానికీ నేనేర్పరచుకొన్న నీమాలుగాని నా కులాన్ని చాటి చెప్పుకునేందుకు చిహ్నాలు గావు.

"విభూధిరేఖలు ఎవరైనా పెట్టుకోవచ్చును. అది ప్రతి మనిషి చివరకు బూడిదై పోతాడనే చిహ్నం. దేవతార్చన ఎవరైనా చేసుకోవచ్చును. అది మానవ మనుగడకే వెలుగుబాట. స్నానం, మడీ- ఇవి ఆరోగ్య సూత్రాలు. ప్రతి మనిషి విధిగా పాటించదగినవి. భోజనం చేసిన చోట అలకడం, శుద్ధిచేయడం, ఆహారానికాశపడిన క్రిమికీట కాదుల నశింపజేసి, ఆహారపదార్థాల పరిసరాలు పరిశుభ్రంగా ఉంచడానికే" అని ఇంకా ఏమో చెప్పబోయినవాడల్లా ఆగి, "ఇవన్నీ మీకు తెలియవి కావు కాని, ఏదో ఆవేశంలో చెప్పుకుపోయాను. నా నిర్ణయం తెలిపాను గదా! మిమ్మల్నింకా విసిగించడం నాకిష్టంలేదు. శలవు!" అంటూ ఇంట్లోకి వెళ్ళిపోయాడు త్యాగరాజశర్మ.

* * *

అనుకొన్నట్లుగా ఆ తెల్లవారి త్యాగరాజశర్మ తన కుటుంబంతోసహా వూరువిడిచి వెళ్ళటంలేదు. కారణం.........

తన వూరితో త్యాగరాజశర్మ ఘర్షణపడిన రాత్రి భీముడి భార్య మూటముల్లె సర్దుకొని ఆయనవద్దకు వచ్చింది. వచ్చి, "అయ్యా! మాకు శలవిప్పించండి!" అంది. ఆశ్చర్యంగా చూస్తున్న త్యాగరాజశర్మ నుద్దేశించి తిరిగి ఇలా అంది-

"బాబూ! మీరొక రకంగా మాకు సహాయం చెయ్యబోతే లోకమో రకంగా భావిస్తుంది. ఇయ్యాల ఆరి మాటలు యిన్నారు గదయ్యా! మీకు అర్థంకాలేదు గానండయ్యా! ఆ ఇరువురి మాటలూ, వంకర నవ్వులూ ఆడదాన్నయిన నాకు తొందరగా అర్థమయినాయి. మా మూలకంగా గోవులాంటి మీరెన్నో మాటలు పడ్డారు. సాలయ్యా, సాలు! మా అన్న ఒకడున్నాడు. ఆడి దగ్గరికే పోయుంటానయ్యా. సచ్చినా బతికినా బనొళ్ళకాడ మేలు" అంది. విస్తుపోయిన శర్మ—

"వాళ్ళనుకుంటే అనుకోనీ! మరో వూరు వెళ్దామన్నాను గదా? నీకేం భయంలేదు, ఎక్కడికీ వెళ్ళొద్దమ్మా!" అన్నాడు. దాని కామె- "నన్నాపకండయ్యా! రత్తాలు పెళ్ళి గొప్ప సదువులు సదివిన వాడితో సెయ్యాలని ఆళ్ళయ్య కెంతో ఉండేది. నేను గనుక మీ ఇంటి కాడుంటే సదువుకున్నాదేమో గానయ్యా...దానికసలు పెళ్ళే కాదు. ఈ పెపంచకంలో పెద్దపేరున్న మగమారాజు కూతుర్లనెవరైన

పెళ్ళి సేసుకోడానికి ముందుకొస్తారు. గాని సెడ్డపేరున్న ఆడదాని గుంటల్నెవరూ సేసుకోరండయ్యా! అందుకని రత్తాలు కోసమన్నా నేనీడ వుండకూడదు" అంది.

ఏమంటాడు? నగ్నసత్యం నోరు విప్పి చెప్పింది. ఇష్టం లేకున్నా వారి ప్రయాణాని కంగీకరించాడు. రత్తాలుని పెళ్ళికూతుర్ని చేసినప్పుడు మెళ్ళో వేయమని రెండు తులాల బంగారు గొలుసూ, దారిబత్తెం క్రింద రెండు వందల రూపాయలూ, కొద్దిగా సామానూ, కొన్ని క్రొత్త చీరలూ, రవికగుడ్డలూ, తన శక్తిమేర ముట్టజెప్పి ఆరాత్రి వాళ్ళని ఆపి తెల్లవారుఝామున వూరు నిద్రలేవకముందే వెంకన్నతోసహా వూరి బయటవరకు వెళ్ళి కన్నీళ్ళతో భీముడి కుటుంబాన్ని సాగనంపివచ్చాడు త్యాగరాజశర్మ.

* * *

పై సంఘటన జరిగిన కొద్ది రోజులకే త్యాగరాజశర్మ ఇంట్లో అనుకోని పరిణామాలు కలిగాయి. జయకి ఏదో రోగం వచ్చింది. దానికొరకు అతడు చూడని వైద్యుడూ, చేయించని వైద్యమూ లేదు. రోగమేమిటో ఎవరికీ అంతుపట్టలేదుగాని అందు నిమిత్తమై ఆస్థి మాత్రం హారతి కర్పూరంలా వైద్యం క్రింద కరిగిపోయింది. జయంటే త్యాగరాజశర్మకి ప్రాణం. ఆమెని కాపాడుకునేందుకు ఎవరేం చెప్పినా చేసేవాడు. ఎవరెక్కడ మంచి వైద్యులు ఉన్నారని చెబితే అక్కడికల్లా పరుగెత్తేవాడు. డబ్బుకై వెనకా ముందు లాలోచించకుండా నీళ్ళలా ఖర్చుపెట్టేవాడు. కాని అతని డబ్బూ, కష్టమూ బూడిదలో పోసిన పన్నీరై ఆరోగ్యం అంతకంతకూ ఎక్కువ కాజొచ్చింది.

చివరికో ఘనవైద్యుడు ఆమెకి కడుపులో పుండు అయ్యిందనీ, ఆమె ఇంకెంతో కాలం బ్రతకదనీ, మందులు ఉపశమనం పొందటం కోసమేగాని జయ ప్రాణాలు మాత్రం నిలపలేవనీ తేల్చి చెప్పాడు.

విలవిల్లాడిపోయాడు త్యాగరాజశర్మ. కాని మినుకు మినుకు మంటున్న ఆశతో మిగిలిన కొద్దిపాటి భూమినీ, దొడ్లనీ అమ్మి జయకు వైద్యం చేయించాడు. కాని వైద్యుడు చెప్పిన క్రొత్త

మందొకటి కొనుక్కురావడానికి బస్తీకి వెళ్ళి తిరిగి ఇంటికి వచ్చే సరికి కడసారి మాట కూడా మాట్లాడకుండా కన్ను మూసింది జయ.

నలుగురిలో గుండెలవిసేలా ఏడవలేదు త్యాగరాజశర్మ. ఆమె శవంపైపడి 'జయా!' అని అరవలేదు. కాని శవంగా మారిన తన మరో ప్రాణాన్ని చూసి వెంటనే మూర్ఛపోయాడు.

* * *

జయ మరణంతో తనకి ఆ వూరితో మిగిలిన కొద్దిపాటి అనుబంధమూ తెగిపోయినట్లనిపించింది త్యాగరాజశర్మకి. అప్పటికి ఆయన వయసు ముప్ఫై సంవత్సరాలు. మళ్ళీ పెళ్ళి చేసుకోమని ఎందరో బలవంతం చేశారు. కాని జయతో కాపురం చిహ్నంగా తనకు మిగిలిన ఒకే నలుసు విధుమౌళి.

విధుమౌళిని పెంచి పెద్దచేసి యోగ్యుడుగా తీర్చిదిద్దటమే తన ఏకైక ఆశయంగా పెట్టుకున్నారాయన. అప్పుడే తన భార్య ఆత్మకి శాంతి అనుకొన్నాడు త్యాగరాజశర్మ. జయను ప్రేమించి పెళ్ళి చేసుకొన్నాడు త్యాగరాజశర్మ. జయతో వివాహం కాకముందు....

పద్ధెనిమిది సంవత్సరాల నూనూగు మీసంతో అప్పుడే యవ్వనంలోకి అడుగెడుతున్నశర్మ ఒకసారి వాళ్ళ బంధువుల ఇంట్లో పెళ్ళికి వెళ్ళాడు. అక్కడ పుత్తడి బొమ్మలావున్న జయను చూసి పెళ్ళంటూ చేసుకొంటే ఆమెనే చేసుకొంటానని ఇంటికి వచ్చాక తండ్రితో చెప్పాడు. అప్పటికే మంచంలో పడిన త్యాగరాజశర్మ తండ్రి విధుమౌళి కొడుకు పెళ్ళి చూడకుండానే పోతానన్న భయంతో బంధువొకాయన్ని జయ తండ్రివద్దకు పంపించి, ఒప్పించి పెళ్ళి చేయించాడు. విధుమౌళికి పదిమంది పుట్టిపోగా మిగిలిన చివరి సంతానం త్యాగరాజశర్మ.

వివాహం జరిగిన ఎనిమిది నెల్లకే త్యాగరాజశర్మ పితృహీనుడు కావటమూ, ఆ తరువాత సంవత్సరం లోనే తండ్రి కావటమూ జరిగింది. ఇరవై సంవత్సరాలకే తండ్రియైన త్యాగరాజశర్మ తన కొడుక్కి 'విధుమౌళిశాస్త్రి' అని తండ్రి పేరు పెట్టుకున్నాడు.

విధుమౌళి తరువాత జయ నాల్గు సార్లు గర్భం ధరించినా పిల్లలు మాత్రం దక్కలేదు...

జయ ప్రేమ చిహ్నంగా మిగిలిన ఈ ఒక్కగా నొక్క కొడుకుని పెంచి పెద్దచేసి విద్యావంతుడుగా తీర్చిదిద్దాలనీ, అందుకు మళ్ళీ పెళ్ళి చేసుకోగూడదని నిర్ణయించుకున్న శర్మ జయ నడయాడిన ఇంట్లో ఆమె లేకుండా తానుండలేక మిగిలిన ఇల్లుని కూడా అమ్మేసి వెంకన్న, కొడుకుతో సహా విశాల ప్రపంచంలో తన స్థానం వెదుక్కుంటూ బయలు దేరాడు.

'కులంగాని వాళ్ళను ఏనాడైతే ఇంట్లోకి రానిచ్చారో ఆనాడే ఆయన ఇంటి లక్ష్మి మాయమయ్యింది' అనుకున్నారు త్యాగరాజ శర్మని గురించి ఆ ఊరి వాళ్ళు.

కాని 'నా కారణంగా ఏ నాడైతే భీముడి కుటుంబం ఈ ఊరి నుండి వెళ్ళిపోయిందో ఆనాడే నా ఇంటిలక్ష్మి నాపై కినిసి వెళ్ళిపోయింది' అనుకున్నాడు త్యాగరాజశర్మ.

* * *

కన్న ఊరినీ, ఉన్న ఇల్లునీ వదలిన శర్మ ఎందరినో ఆశ్రయించాడు. కురికేళలో జమీందారుగారిని కలిస్తే వారిచ్చిన డబ్బుతో కొద్ది నెలలైనా జరగలేదు. మళ్ళీ వెళ్ళడానికి ఆత్మాభిమానం అడ్డొచ్చింది. ఎందరెందరో దొరలనీ, దాతలనీ కలిసి తనకి ఊరికే డబ్బివ్వక్కరలేదనీ, నెలజీతంగా ఏర్పాటు చేస్తే వారి పిల్లలకు సంగీత విద్య బోధించగలనని అన్నాడు. కాని దానికి వారు "చూడండి శర్మగారూ! కాలం వెనకటిలా లేదు. మారిపోయింది. ఆస్థాన సంగీత విద్వాంసుడ్ని ఏర్పాటు చేయడానికి మాకున్న భూములు వగైరాలే ప్రభుత్వ పరమౌతున్నాయి. పోనీ పిల్లలకి సంగీత విద్య చెప్పించడానికి వారెవరికీ ఆ విద్య యందభిరుచి లేదు. కావాలంటే పాతికో పరకో సాయం చేయగలం గాని అంతకు మించిన శక్తి మాకు లేద"ని చెప్పేశారు. ఎక్కడికి వెళ్ళినా ఇదే సమాధానం. ఇంకేం చేయగలడు?

పోనీ కొంతమంది పిల్లల్ని కూర్చుకుని సంగీత విద్య బోధించాలనుకున్నాడు. కాని ఎక్కడికి వెళ్ళినా ఎవరినడిగినా

వినడానికిష్టపడిన సంగీత విద్యని అభ్యసించడానికి ఎవరూ ముందుకు రాలేదు.

అలా కొన్ని రోజుల శ్రమానంతరం కొన్ని పాఠాలు దొరికినా డబ్బులేక మధ్యలో మానేసిన వారు కొందరూ, సంగీతం మాష్టారంత బాగా మా పిల్లవాడు పాడటం లేదని కొందరూ, డబ్బూ-కంఠమూకి బాగున్నా యవ్వనంలో ఉన్న అతని వద్దకు ఆడపిల్లల్ని పంపడాని. లోకానికి ఝడిసి కొందరూ, అన్నీ ఉన్న వారు సక్రమంగా చెప్పించుకోదల్చినా కొందరు బదిలీలయిపోయి, కొందరు రోగాలు వచ్చీ అంతా మానుకున్నారు. పదిహేను మందితో ప్రారంభించిన పాఠశాలలో చివరకు ఒక్కళ్ళు కూడా మిగలలేదు.

ఏం చేయాలో తోచలేదతనికి. అతనికి వచ్చినవి రెండే విద్యలు. సంగీతం, సంస్కృతం. పోనీ సంస్కృత పాఠశాల తెరుద్దామనుకున్నాడు గాని, సంగీతాన్నే నేర్చుకోని ప్రజలు అర్థంగాని సంస్కృత భాషాభ్యాసానికి పూనుకుంటారనే నమ్మకం లేక ఆ ప్రయత్నం విరమించు కున్నాడు. చివరకు వాళ్ళు, వీళ్ళిచ్చిన డబ్బు ఐపోగా రెండు రోజులు ఉపవాసాలు కూడా ఉన్నారు. అది చూడలేక వెంకన్న—

"పోనీ బాబూ! నే నేదైనా కష్టం చేసుకుని వస్తాను. మీరు అనవసరంగా శ్రమపడకండి. మీకు ఏదైనా ఆధారం దొరికేవరకు నా రెక్కల కష్టం మీద మనమంతా బ్రతుకుదాం!" అన్నాడు.

అందుకు త్యాగరాజశర్మ తీవ్రంగా బదులిచ్చాడు. "చూడు వెంకన్నా! నేను యజమానిని. యజమాని భర్తతో సమానం. నేను సంపాదించి తేవాలి. మనమంతా తినాలి. నాతోపాటు కలో గంజో త్రాగుతూ దొరకని నాడు ఉపవాసాలో, ఉప్పిళ్ళో ఉండగల శక్తి నీకుంటే విధుమౌళిని చూసుకుంటూ ఇంట్లో ఉండు. లేదంటే మా కష్టాలు మేం పడి మా బ్రతుకేదో మేం బ్రతుకుతాం. నీవు రెక్కల కష్టమేనా చేసుకో, మరేదయినా చేసుకో! మళ్ళీ మా కంటికి కనిపించకుండా వెళ్ళు."

ఈ మాటలకు వెంకన్న నొచ్చుకుంటూ, "అదేంటి బాబూ! అలాగంటారు? సుఖమే గాని కష్టం తెలియని తమరుపవాసా

లుంటుంటే చూడలేక అట్టా అన్నాగాని మీకు కలిగిననాడు మీకాడ సుకంగా తిని ఈరోజు మీరు పేదోరు కాగానే ఎల్తాననుకున్నారా?" అన్నాడు.

ఆ తరవాతెప్పుడూ వెంకన్న కాయకష్టం చేసుకొస్తానని అనలేదు.

*　　　*　　　*

రాత్రంతా ఆలోచనలతో గడిపి ప్రొద్దుపోయి నిదుర లేచిన త్యాగరాజశర్మ తను లేచేసరికి మోకాళ్ళమీద గడ్డం ఆనించి కూర్చున్న తన కొడుకుని చూడగానే చప్పున లేచి వెళ్ళి ఎత్తుకున్నాడు. ఆ పసివాని ముఖమంతా పీక్కుపోయి ఉంది. ఔను! రెండు రోజుల నుండి తిండి లేదు మరి!

రాత్రంతా ఆలోచించి ఒక నిర్ణయానికి వచ్చిన శర్మ, "బాబూ! ఈ రోజు తప్పకుండా బియ్యం అవీ కొనుక్కు వస్తాను. వండుకుని తిందాం- ఏం?" అన్నాడు.

ఆ పిల్లవాడు సరే నన్నట్లు తల ఊపాడు. పదకొండవ సంవత్సరంలోకి అడుగిడుతున్న విధుమౌళికి సంసార పరిస్థితులు కొద్ది కొద్దిగా అర్థమౌతుండటం వల్ల 'నాన్నా ఆకలి!' అని నోరు తెరిచి అడగలేకపోయినా కళ్ళలో ప్రాణాలు పెట్టుకుని ఉపవాసాలున్న కొడుకుని చూసి నీరు కారిపోయాడు శర్మ. ఆ రోజే ఒక శెట్టిగారి కొట్టులో జమా ఖర్చులు చూసే పనికి కుదిరి ముందు డబ్బు అప్పుగా తెచ్చుకుని ఆ రోజు వండుకు తిన్నారు. కాని ఆ సంతోషం పది రోజులయినా ఉండలేదు. ఆ రోజు శెట్టిగారి బంధువొకాయన వచ్చి త్యాగరాజశర్మని గుర్తుపట్టి, "మీరు సంగీతం పండితులుగారు కదూ?" అన్నాడు.

శెట్టి ఆశ్చర్యపడి, "ఏమిటీ, వీరు సంగీతం పాడతారా?" అన్నాడు.

అతని బంధువు ఆశ్చర్యపడి, "జమీందారుగారు వీరికి సన్మానం కూడా చేశారు. అద్భుతగాయకులు. నీకు తెలియదా?" అని అడిగాడు.

అది విన్న శెట్టిగారు- "నా కింత వరకూ తెలియదు. ఎంత పొరపాటు చేశాను!" అంటూ నొచ్చుకుంటూ త్యాగరాజశర్మ ఎంత చెప్పినా వినిపించుకోకుండా- "అయ్యా! తమలాంటి గొప్పవారితో పని చేయించు కోవడం నాకు మంచిది కాదు. నేనే ధనవంతుణ్ణయితే ఇంకేడికీ పోకుండా తమర్ని ఆదుకునే వాణ్ణి. కాని పరమేశ్వరుడు నాకా శక్తిని ఇయ్యలేదు. తమరి పేరు వినడమేగాని తమర్నెన్నడూ చూడలేదు గనుకనే ఈ పొరపాటు జరిగిపోయింది. నన్ను క్షమించండి. ఈ డబ్బు పట్టుకెళ్ళండి. తమరితో చేయించుకునేంత గొప్పోణ్ణి కాదు నేను!" అంటూ కొంత డబ్బిచ్చి పంపించాడు. దొరికిన ఈ చిన్న ఆధారము కూడా తన సంగీత విద్యవల్ల చేయి జారిపోవడంతో మొదటిసారిగా తన విద్యపై ఏవగింపు కల్గింది త్యాగరాజశర్మకి.

* * *

ఆ తర్వాత చిన్న ప్రయివేటు స్కూల్లో ఉపాధ్యాయుడుగా చేరాడు. కాని, అదీ మూడు రోజుల మురిపమే అయ్యింది. ఆ పాఠశాల నిర్వాహకుడు వేరే వూరిలో వుంటున్నాడు. ప్రధానోపాధ్యాయుడు త్యాగరాజశర్మను ఉపాధ్యాయుడిగా చేర్చుకొని నిర్వాహకునికి కబురు పంపించాడు. నిర్వాహకుడు వచ్చి ఎక్కడో సంగీత సభలో చూసినట్లు గుర్తుపట్టి ప్రధానోపాధ్యాయుని బాగా చివాట్లేశాడు.

"మీకేమైనా బుద్ధి ఉందా? సంగీతం పాడేవాళ్ళకి ఒకే రకం ధ్యానముంటుంది. వాళ్ళని ఉపాధ్యాయులుగా చేర్చుకుంటే మన సంస్థ ఏనాడూ అభివృద్ధిలోకి రాదు" అని. అందుకు ప్రధానోపాధ్యాయుని సమాధానం కూడా సూటిగానే ఉంది. "వీరి పేరు వినే నేను చేర్చుకొన్నానండీ! ఇలాంటివారుంటే మన సంస్థ అభివృద్ధిలోకి త్వరగా రాగలదు. ఎందుకంటే వీరికి మంచి పేరు ప్రతిష్టలున్నాయి గదా? ఆ విధంగా జనం ఆకర్షితులౌతారు. అదీగాక వీరి బోధన కూడా చాలా బాగుంది. రెండు రోజులు పరీక్షించిన పిమ్మటే చేర్చుకొన్నాను" అదీ జవాబు.

దాంతో ఆ నిర్వాహకుడు మండిపడి, "నీకు లోకజ్ఞానం లేదు. లోకజ్ఞానం తెలియని నిన్ను ప్రధానోపాధ్యాయుడుగా ఉంచ

తగదంటూ అతణ్ని కూడా తొలగించాడు. తన విద్య తనకేగాక తనవి సమర్థించిన వారికి కూడా జీవనాధారం లేకుండా చేసినందుకు సంగీతవిద్యను ఎంతగానో శపించివేసాడు శర్మ.

* * *

అలా చాలా చోట్లలో జీవన భృతికొరకు తిరిగాడు త్యాగరాజ శర్మ. ఎన్నో అవకాశాలు వచ్చాయి. కాని అవన్నీ తనకు తెలిసిన వారివల్లా, తన విద్య గురించి తెలిసిన వారివల్లా చేయి జారిపోతూ వచ్చాయి. ఈవిధంగా ఒక్కో అవకాశం జారిపోయి నప్పుడల్లా సంగీతకళపై తనకున్న ఉన్నతాభిప్రాయాలు ఒక్కొక్కటీ అధః పాతాళానికి దిగజారజొచ్చాయి.

* * *

ఇలాంటి పరిస్థితిలో ఒకనాడు విధుమౌళి శరీరంపై వాతలు గనుక తేలకుండా ఉంటే త్యాగరాజశర్మ బ్రతుకులో అంత పెద్ద మార్పువచ్చేది గాదు. అదెలా జరిగిందంటే—

ఉపాధి వేటలో ఊరూరూ తిరుగుతున్న త్యాగరాజశర్మ, శ్రీపురి అనే ఊళ్ళో గానసభ చేసాడు. ఆ మరునాడు త్యాగరాజ శర్మకి ఆతిథ్యం ఇచ్చిన ఇల్లుగలాయన శేషగిరి—

"శర్మగారూ! మా ఇంట్లో ఒక పిల్లనగ్రోవి వుంది. అది మా పూర్వీకులెవరో వెండితో చేయించుకొన్నారు. చక్కని స్వరం వస్తుంది. మాకిప్పుడెవరికీ సంగీతంపై శ్రద్ధాలేదు, ఉన్నా రాదు. కనుక అది అలంకార వస్తువుగా మా అల్మారాలో భద్రపరిచాం చూడండి!" అంటూ పిల్లనగ్రోవివి శుభ్రంగా కడిగి త్యాగరాజశర్మ కిచ్చాడు.

అది తీసుకొని పరీక్ష చేశాడాయన. చక్కని సుస్వరం వస్తున్నది. సంగీత మభ్యసించేప్పుడే తను స్వంతంగా వేణువు ఊదడం కొంతవరకు అభ్యాసం చేశాడు. వేణువూదటంలో పరిపూర్ణత సంపాదించలేకపోయినా అపస్వరం లేకుండా నాదం పలికించగలడు.

"నిజమేనండీ! ఇది మంచి కళా ఖండం. ఇదే గనక కొద్ది సంవత్సరాల ముందు చూపి ఉంటే తప్పక మీనుండి కొనేవాడివి!" అని వెంటనే దాన్ని తిరిగి ఇచ్చేసాడు.

ఆ తెల్లవారి మరొకతను త్యాగరాజశర్మకి తనింటికి విందుకు రావల్సిందిగా ఆహ్వానించాడు. వాళ్ళింట్లో భోజనంచేసి వెంకన్ననీ, విధుమౌళినీ అక్కడ వుండమని తను వూళ్ళోకి వెళ్ళాడు.

త్యాగరాజశర్మ తిరిగి వచ్చేసరికి విధుమౌళి వెక్కి వెక్కి ఏడుస్తున్నాడు. వెంకన్న ఓదారుస్తూ ఎవ్వరిమీదో పెద్దగా అరుస్తున్నాడు. సంగతేమని కనుక్కుంటే వెక్కిళ్ళ మధ్య విధుమౌళి కొంతా, వెంకన్న కొంతా చెప్పిన మాటల సారాంశ మిది.

విన్నటిరోజున శేషగిరి చూపించిన వేణువు కనిపించలేదుట. ఆయన విధుమౌళివద్దకు వచ్చి, "నువ్వు వేణువు ఏమైనా తీశావా?" అని అడిగాడట.

దానికి విధుమౌళి-"అంత దొంగబుద్ధి నాకు లేదండీ! నేను తీయలేదు" అన్నాడట.

శేషగిరి-"విన్నేమో మీ నాన్న 'శక్తివుంటే అది కానేవాణ్ని!' అన్నాడు. నీవేమో చాలా రాత్రివరకు మా పిల్లలతో ఆడుకున్నావు. నీవు ఎప్పుడు వెళ్ళిందీ మేము చూడనేలేదు. వీలుగా వేణువు కాజేసి వుంటావు. కూటికి లేకుంటే ఎన్ని దొంగతనాలైనా చెయ్యొచ్చు. ఎక్కడ పెట్టావో త్వరగా చెప్పు!" అన్నాడట. దాంతో విధుమౌళికి కోపంవచ్చి, "కూటికి లేకుంటే చావైనా చస్తాంగాని, దొంగతనమైతే చెయ్యమండీ!" అన్నాడట.

అందుకు శేషగిరి కోపంగా-"ఆఁ, ఆఁ మీరు చావైనా చస్తారుగాని,సంగీతం పిచ్చిమాత్రం విడవలేరు. ముందే మీరు సంగీతం పిచ్చిగల వాళ్ళు మీకది నేను చూపేసరికి అబ్బాకొడుకులు కల్సి దాన్ని కాజేసి ఉంటారు. ఎక్కడ దాచావో నిజం చెప్పు!" అంటూ నేను తియ్యలేదు మొర్రో అంటున్నా వినకుండా విధుమౌళిని పట్టుకొని చావబాదాడట. ఆ సమయంలో వెంకన్న కూడా లేడుట. చుట్టకని కొట్టుకు వెళ్ళివచ్చిన వెంకన్న గనుక ఆపకపోయినట్లయితే చంపేసేవాడేట. విషయమంతా విన్న త్యాగరాజశర్మ అప్పటికే ఆ గొడవకి చుట్టూ చేరిన వాళ్ళని చూసి అవమానంతో దహించుకుపోయాడు. ఒళ్ళు తెలియని ఉక్రోషంతో శేషగిరినుద్దేశించి, "నువ్వు మనిషివా?

పశువ్వా? తియ్యలేదని పిల్లవాడు చెప్పిన తర్వాత కూడా అలా కొడతావా?" అన్నాడు.

అందుకు శేషగిరి ఏమాత్రం తొణుక్కుండా-"రా నాయనా, రా! నీకోసమే ఎదురుచూస్తున్నాను. అది తప్పక మీరే తీసి వుంటారు. ఎక్కడ దాచావో చెప్పు!" అన్నాడు. అతని మాటలకి త్యాగరాజశర్మ ఒళ్ళంతా కారం పూసినట్లయింది. "నా పిల్లవాణ్ని చావబాదిందేగాక నామీద దొంగతనం అంటగడతావా? పైగా సంగీతం పిచ్చి ఉన్న వాళ్ళు అంటావా? మర్యాదగా ఇక్కడనుండి వెళ్ళిపో! లేకుంటే ఏంచేస్తానో నాకే తెలియదు" అన్నాడు ఆవేశంతో వూగిపోతూ.

శేషగిరి వెకిలి నవ్వొకటి నవ్వుతూ, "నీ బెదిరింపులకీ, అరుపులకీ భయపడి సొమ్ము నీ పరంచేసి పారిపోతాననుకోకు. నీ సామాన్లపెట్టె, బట్టలూ అన్నీ చూపించు. వెండి వేణువు అదే బయట పడుతుంది" అన్నాడు.

ఊరు ఊరంతా అక్కడ చేరింది. అందరినీ చూసి త్యాగరాజ శర్మ కొద్దిగా కోపాన్ని అణచుకొని వూరివాళ్ళందరినీ ఉద్దేశించి, "అయ్యా! నిన్న ఈయన నాకు ఆ వెండి వేణువు చూపించిన మాట నిజమే, నేను డబ్బుంటే అది కొంటానన్న మాటా నిజమే. మా పిల్లవాడు చాలా రాత్రివరకు శేషగిరి ఇంట్లో ఆడిన మాటా నిజమే. కాని అది మేము మాత్రం దొంగలించలేదు. అదెవరు తీసారో మాకు తెలియదు" అన్నారు.

త్యాగరాజశర్మ నుద్దేశించి గ్రామ పెద్ద ఒకరు- "శర్మగారూ! మరలాంటప్పుడు మీ సామాన్లూ, పెట్టె అతనికి చూపించండి. నిర్దోషులయిన వారికి భయమేమిటి? పెట్టె చూపించడంవలన మీకు వచ్చిన నష్టమేమిటి?" అన్నాడు.

అందుకు పేలవంగా నవ్వాడు త్యాగరాజశర్మ.

"నిజమే! మా బాగా శలవిచ్చారు. నాకు డబ్బు లేదు గనుక నలుగురి ముందు పెట్టె చూపించినా నష్టం లేదు. నేనీరోజున పేద వాడిలా మీకు కనబడుతున్నాను గనుక నన్ను ఎవరెన్ని మాటలన్నా మీకు నష్టంలా కనిపించదు. ఇదే సంపదగలవారైనా, హోదాగల

వారైనా గనుకయితే అతని ముందు కనీసం పోయింది అని కూడా అనుకొనేవారు కాదు.

"అయినా మీ వూళ్ళోకి నేను యాచించడానికి వచ్చినట్టు వచ్చాను. అందుకు మీరంతా ఏ మాటంటే ఆ మాట మీద విలబడ తాను. కాని నాకూ ఆత్మాభిమానం వుంది. అందుకు విరుద్ధంగా ఏ పనీ చేయలేను. నా అభిమానం చంపుకొని మీ అందరికీ నా పెట్టె, సామానులూ ఒక్కొక్కటీ విప్పదీసి అణువణువూ గాలించి మీకు చూపిస్తాను. కాని ఒక్క షరతు. అందుకు ఒప్పుకొంటేనే నేను సామాన్లు చూపించుతాను" అన్నాడు దృఢంగా.

త్యాగరాజశర్మ మాటల ధోరణి చూస్తే అక్కడున్న వారందరికీ ఆశ్చర్యమేగాక వేణువీతని దగ్గరుండబట్టే ఇలా కల్లబొల్లి కబుర్లు చెబుతున్నాడేమో.అనే అనుమానం కూడా కలిగింది.

"అదేమిటో చెప్పు! అందుకు నేను తప్పక ఒప్పుకొంటాను" శేషగిరి అభయమిస్తున్నట్లుగా అన్నాడు.

'వేణువు ఈతని దగ్గరే ఉంది గాబోలు. అది గనక దొరికితే జైల్లో పెట్టించవద్దని త్యాగరాజశర్మ షరతు పెడతాడు గాబోలు' అనుకొన్నాడతను.

కాని శర్మ చిన్నగా పెదవి విప్పి. "అయ్యా! వేణువు మా సామాన్లలో గనుక దొరికినట్లయితే మా పిల్లవాడూ, నేనూ, మా మనిషీ ఒక్కొక్కళ్ళూ వంద కొరడా దెబ్బలు చొప్పున మూడు వందల కొరడా దెబ్బలు తింటాము.

"కాని మా దగ్గర దొరక్కపోయినట్లయితే మా పరువు నలుగురిలో తీసినందుకు ఆ మూడు వందల దెబ్బలూ నా కుమారుని చేతిలో తినాలి. అందుకు ఇష్టమేనో, కాదో పెద్ద మనిషిని అడగండి!" అన్నాడు.

ఆయన మాటలకు అంతా ఆశ్చర్యపోయారు.

శేషగిరి ఓ క్షణం విభ్రాంతిపోయినా, "ఇదేదో దొంగ నాటకం. నీ దగ్గరుండబట్టే ఈ మాయ మాటలు చెబుతున్నావు. ఐనా నిన్ను విడిచిపెట్టేది లేదు. నీ షరతులకి అంగీకరిస్తున్నాను. ముందు పెట్టె తియ్యి!" అన్నాడు శేషగిరి.

అందరి ముందు త్యాగరాజశర్మ తన పెట్టెలోని ఒక్కొక్క వస్తువును తీయసాగాడు. అలా అతను చూపిస్తున్నప్పుడు వూరులోని సగంమంది ఆ పెట్టెకేసి ఆత్రంగా ఇహనో, ఇప్పుడో దొరుకుతుంది అన్నంత నమ్మకంగా చూడసాగారు. అణువణువూ గాలించి చూపించి తనుగాక మరొకతనితో కూడా వెదికించాడు. తన అంగవస్త్రమంతా దులిపి చూపించాడు. వెంకన్నని కూడా అలాగే చెయ్యమన్నాడు. తన కొడుకు దుస్తులు విప్పి చూపించాడు.

అంతా ముగిసిన తర్వాత, "అయ్యా- చూసారుగా! మావద్ద లేదు. పోనీ నేను అమ్మాననుకోవడానికి మీ వూరు వదలి మరో వూరు నేను వెళ్ళనే లేదు. దాచాననుకోవడానికి నాకీ వూరే కొత్త. ఇప్పటి కయినా ఆ సొమ్ము నేను తియ్యలేదని నమ్మ..."

ఇంకా అతనేదో అనబోతూండగా పిల్లనగ్రోవితో అక్కడ ప్రత్యక్షమయ్యాడు-రాత్రి విధుమౌళితో ఆడిన శేషగిరి కొడుకు.

'సొమ్ము దొరికిందని తండ్రి తనను ఎంతగా మెచ్చుకొంటాడో' నని పరుగెత్తుకొంటూ, వగరుస్తూ సంతోషంగా అక్కడికి వచ్చిన ఆ పిల్లవాణ్ని అందరూ ఆశ్చర్యంగా చూసారు. అందరూ తనవేపే చూడటంతో కొద్దిగా ఇబ్బంది ముఖం పెట్టి ఆ పిల్లవాడు—

"నాన్నా! మన అల్మారా పక్కగా గోడలో చిన్న రంధ్రం లేదూ, అందులో పెట్టింది మన చిట్టి దీన్ని. వాళ్ళబ్బాయితో ఆడానని నన్నుకొట్టి నువ్విక్కడికి వచ్చేశాక ఇల్లంతా జాగ్రత్తగా వెదుకు తున్నాను. అంతలో ఇది కనబడింది. అమ్మకుకూడా చెప్పకుండా నీకు చూపించాలని పరుగెత్తుకు వచ్చేశాను.

"నిన్నరాత్రి మన చిట్టి దీనితో ఎంతో సేపు ఆడింది నాన్నా! అని నేను ఎంత చెప్పినా వినకుండా నన్ను కొట్టావుగాని, అది ఆడుకున్న చోటే దొరికింది-చూడు" అన్నాడు.

అంతా స్తబ్ధులయ్యారు. త్యాగరాజశర్మ పరమశివునికి మనసు లోనే మొక్కుకొన్నాడు. అప్పుడు—

వెంకన్న ఆవేశంగా లేచాడు. ఆ పిల్లవాడి చేతిలోనుండి వేణువు లాక్కున్నాడు. అది తీసి శేషగిరి చేతిలో పెట్టి ఆ దవడా,

ఈ దవడా ఎడాపెడా వాయించేస్తున్నాడు. ఉగ్ర నరసింహావతారం దాల్చిన వెంకన్నని ఆపడానికి ఎవ్వరూ సాహసించలేకపోయారు.

తప్పించుకోవాలని చూస్తున్న శేషగిరిని బరబరా ఈడ్చుకొచ్చి, త్యాగరాజశర్మ కాళ్ళమీద పడేసి, "దొంగనా కొడకా! డబ్బంటేకానని ఖఖానివి కనుక వెనకా ముందు ఆలోచించకుండా గోవులాంటి మడిసి మీద అంత నిందేసావు. ఆరబ్బాయిని చావబాదావు. నలుగురిలో ఆరి పరువు తీశావు. నీలా డబ్బున్నప్పుడు నీలాంటి కుక్కల్ని పదింటిని సాకారు ఆయన.

"కాని ఏనాడూ నీలా మిడిసి పడలేదు. తప్పుడు వెధవా! మా అయ్యగారినీ, ఆరిబిడ్డనీ కాళ్ళ మీదపడి క్షమించమనడుగు లేకుంటే నిన్నిడే పూడ్చిపాతరేస్తాను. మళ్ళా ఇంకెవర్నీ ఇలా సెయ్యకుండా నీయంటి కుక్కలకి బుద్ధి రావాలి ఊఁ-క్షమించమనడుగు!" అంటూ ఆవేశంతో అతన్ని విసురుగా పడదోశాడు

కాని శర్మ అతను తన కాళ్ళమీద పడకుండా కాళ్ళు దగ్గరగా లాక్కుంటూ, "వెంకన్నా ఆగు!" అని వెంకన్నని పట్టుకుని ఆపాడు. ఆ తర్వాత రెండు చేతులెత్తి ఊరందరికీ నమస్కరిస్తూ—

"అయ్యా! ఉన్న ఊరు వదలకూడదనీ. అందునా పొట్టచేత బట్టి వూరూరా తిరగకూడదనీ చెప్పడానికి నా జీవితం చక్కని ఉదాహరణ. నాకు మీరంతా తగిన శాస్తి చేసారు. చోద్యంలా నిలబడి ఆసక్తిగా చూసారేతప్ప మీలో ఒకరైనా 'అతనలాంటివాడు కాదు' అనలేక పోయారు.

"అందుకు మీ అందరికీ కృతజ్ఞుడ్ని. ఇంత అవమానాలపాలై మీకు చూపించిన గుడ్డలూ, బట్టలూ భిక్షగాడిలా తిరిగి మూట కట్టుకోలేను. ఇదిగో నిన్న కచ్చేరి చేసిన ఐదువందల రూపాయలు! అవీ నా వస్తువులూ, నన్ను అవమానించిన ఈ సామాన్లూ అన్నీ ఇక్కడే వదలి కట్టుగుడ్డలతో వెళ్ళిపోతున్నాను చక్కని గుణపాఠం నేర్పిన మీ అందరికీ నా పదివేల నమస్కారాలు!" అంటూ ఊరివారంతా ఆశ్చర్యంనుండి తేరుకోకముందే విధుమౌళిని ఎత్తుకుని వెంకన్న వెంటరాగా వడివడిగా కదలి ఆ వూరు విడిచి వెళ్ళిపోయాడు త్యాగరాజశర్మ.

* * *

అదేరోజు విధుమౌళి వంటిమీది వాతల్ని చూసి ఎన్నడూ

లేనిది కంటనీరు పెట్టుకుంటూ- "నాయనా! నా సంగీత విద్య మనకి విలువ నీడలేకుండాచేసినా సహించాను. ఎన్నెన్నో అవమానాలు ఆ విద్యవల్ల కలిగినా భరించాను. కాని నీరక్తం కళ్ళచూసిన నా విద్యని నేటినుండి త్యజించుచున్నాను" అంటూ వంతెన మీదుగా పోతున్న రైలు కిటికీలోనుండి క్రింద ప్రవహిస్తున్న నీళ్ళలోకి తంబూరాను విసురుగా విసిరేశాడు.

ఆ రోజు ఊరి వారందరి ముందునుండి కట్టు బట్టలతో బయలుదేరిన శర్మ, ఓ రైల్వే స్టేషనుచేరి ఇన్నిరోజులూ తన సంగీత చిహ్నంగా దాచుకుంటూ వచ్చిన కుడిచేతి కంకణాన్ని స్టేషనుకి దగ్గరగా ఉన్న ఒక కొట్టులో అమ్మి, ఆ డబ్బుతో హైదరాబాద్ బయలుదేరాడు. రైల్లో జరిగిన సంఘటనలు మళ్ళీ గుర్తురాగా ఆవేశం ఆగక తంబూరాని క్రింద పారుతున్న నీళ్ళలోనికి విసిరేశాడు. అతని చర్యలను చుట్టూ కూర్చున్నవారు వింతగా ఆశ్చరంగా చూశారు.

గమ్యం తెలియని తమ ప్రయాణాన్ని గురించి ఆలోచిస్తూ ఎపుడు నిద్రలోనికి జారాడోగాని, "నాన్నా! అందరూ దిగారు. మనం దిగవద్దూ?" అని విధుమౌళి తట్టితే ఉలికిపడి లేచాడు. నిద్రలో చెప్పొకటి జారిపోగా దాన్ని తీసుకుందుకై క్రిందికి వంగిన త్యాగరాజశర్మ ప్రక్క సీట్ క్రింద ఏదో సంచీ పడుండటం చూశాడు. దాన్ని చేతిలోనికి తీసికొని లేచి చుట్టూ చూశాడు. ఎవ్వరూ కనిపించలేదు. అప్పటికే అంతా దిగేశారు. సంచీ పట్టుకుని అలాగే రైలు దిగాడు.

రైలుదిగగానే సంచీలో ఉన్న వస్తువులు ఒక్కటొక్కటిగా బయటకు తీసాడు. అందులో రెండు కండువాలు, ఒకధోవతి, ఏదో కాగితం పొట్లం ఉన్నాయి. కాగితం పొట్లం విప్పగా అందులో నిన్నో మొన్నో తయారుచేసిన బంగారు మంగళ సూత్రపు త్రాడు, మంగళ సూత్రాలూ మట్టెలూ కన్పించాయి.

అవి వెంకన్నకి చూపించి మళ్ళీ ఎలా ఉన్నవి అలాగే సంచీలో పెడుతూ-"వెంకన్నా! ఎవరో పెళ్ళికి వెళుతూ హడావుడిలో ఈ సంచీ ఇక్కడే వదలిపోయారు, ఎంతోదూరం వెళ్ళకముందే తప్పక గుర్తుకు తెచ్చుకుని వెదుక్కుంటూ వస్తారు. దొరుకుతుందనే ఆశలేకున్నా అదృష్టాన్ని పరీక్షించుకునేందుకైనా తప్పక వస్తారు.

"అందుకని మనం మరో రెండుగంటలు ఇక్కడ ఎదురు చూస్తూ కాలం గడుపుదాం. ఎవరూ రాకుంటే ఏంచేయాలో తర్వాత ఆలోచించుకోవచ్చును—ఏమంటావ్?" అని అడిగాడు త్యాగరాజ శర్మ.

"బాబూ! ఇంత పేదరికంలోనూ తమదెంత దొడ్డబుద్ధి బాబయ్యా! అలాగే చెయ్యండి!" అన్నాడు వెంకన్న.

మరో అరగంటలోనే త్యాగరాజశర్మ ఊహించినట్టు ఓ నడి వయస్కుడు వీళ్ళ ముందునుండే పరుగెత్తుకుంటూ వెళ్ళి రైలుపెట్టెలో ఎక్కాడు. అప్పటికింకా ఆ రైలు సికిందరాబాద్ నుండి బయలుదేరనే లేదు. కొద్దిసేపు తర్వాత అతను ముఖం వ్రేలాడేసుకుంటూ రైలు పెట్టెదిగి క్రిందకి వచ్చాడు.

ఇంతలో త్యాగరాజశర్మ సౌంజ్ఞ గమనించి వెంకన్న ఆ వ్యక్తి వద్దకువెళ్ళి, "అయ్యా! ఏమిటో వెదుకుతున్నట్లున్నారూ!" అన్నాడు.

దానికాయన-"మావాళ్ళు ఇక్కడో సంచీ మరచిపోయారుగా" అని ఆగాడు మాట పూర్తిచేయకుండా.

" ఆ సంచీలో ఏముంది బాబూ!" అని అడిగాడు వెంకన్న.

ఈమారతను వెంకన్నని పరీక్షగా చూసి ఆసక్తిగా, "ఏం నీకే మైనా దొరికిందా?" అనబోయి, 'దొరికితే ఇచ్చేవాళ్ళెవరుంటారు? ఏదో ఊసుబోని కబుర్లకై ఉంటుంది' అనుకుని యధాలాపంగా అన్నాడు "బంగారు నగలూ, గుడ్డలూ ఉన్నాయి" అని.

ఈలోగా వాళ్ళ వద్దకు వచ్చిన త్యాగరాజశర్మ-"ఈ సంచీయేనా తమరిది?" అని అడిగాడు సంచీ ఎత్తిచూపిస్తూ.

ఆ సంచీని చూడగానే అతనికి సంభ్రమాశ్చర్యాలు ఒకేసారి కల్గగా-"ఇదే-ఇదే!" అంటూ త్యాగరాజశర్మ చేతిలోనుండి బలవంతంగా లాక్కున్నట్టు సంచీని లాక్కున్నాడు.

"మీ సంచీ మాకు రైల్లో దొరికింది. దానికొరకు ఎవరో ఒకరు రాకపోరని ఇంతసేపటినుండి ఎటూవెళ్ళక ఇక్కడనే నిల్చున్నాం. ఇంక మేం వెళ్ళొస్తామండీ! మీ నగలూ గుడ్డలూ సంచీలో ఉన్నాయో లేవో చూసుకోండి!" అన్నాడు త్యాగరాజశర్మ అతన్ని ఉద్దేశించి.

అప్పటికీ లోకంలోకివచ్చి ఆయన తన తప్పు తెల్సుకున్నాడు.

'తను బలవంతంగా సంచీ లాక్కోవడమూ, కనీసం కృతజ్ఞతైనా చెప్పకపోవటమూ ఎంత అమర్యాద ప్రవర్తన!'

వెంటనే ఇలా అన్నాడు- "క్షమించండి! దొరకదనుకున్న వస్తువు మీచేతిలో కనబడేసరికి నాకు తెలియకుండానే మీ నుండి లాక్కున్నాను. కనీసం కృతజ్ఞతైనా చెప్పలేదు. ఇకపోతే ఇందులో బంగారం ఉందోలేదో చూసుకోమన్నారు. నేను చూడకుండానే చెబుతున్నాను. ఇందులో పిసరంత బంగారం కూడాపోదు. నావస్తువుల్ని నాకప్పగించడానికి అరగంటనుండి ఇక్కడ కూర్చున్న మీరు, అందులోని బంగారం కాజేశారని నేననుకుంటే అది మానవత్వాన్నే అవమానించి నట్టవుతుంది." అని, "ఆఁ ఇంతకూ మీరు ఎక్కడికి వెళ్ళాలి? పదండి-నడుస్తూ మాట్లాడుకుందాం!" అన్నాడు.

ఆయనతోపాటు స్టేషను బయటకు వచ్చారు త్యాగరాజశర్మ, వాళ్ళు.

"మీరు ఎక్కడికి వెళ్ళాలి?"

"మాకు గమ్యంలేదు. కాలప్రవాహంలో కొట్టుకుని ఈ రోజే ఈ ఊరికివచ్చిన వాళ్ళం. గమ్యం ఏముంటుంది?"

"అలాగా! ఐతే ఓ పని చేయండి. ప్రస్తుతానికి మీరు నాతో రండి! తరువాత నెమ్మదిగా ఎక్కడికి వెళ్ళాలో నిర్ణయించుకోవచ్చును."

త్యాగరాజశర్మ మౌనంగా తనలో అనుకున్నాడు. 'భగవంతుడు ప్రస్తుతానికో ఏర్పాటు చేయడానికే ఇతన్ని పంపించాడు. ఇప్పటికి ఇతనితో వెళ్ళి తరువాత జరగబోయే కార్యక్రమాన్నిగురించి ఆలోచించుకోవచ్చును.' అనుకుని అతనితో వెళ్ళడానికి అంగీకరించారు.

బస్సుకొరకు నిరీక్షిస్తున్న సమయంలో అతను తన వివరాలు చెప్పాడు. సంగ్రహంగా ఆయన చెప్పిన సారాంశమిది. ఆయనపేరు వెంకటపతి. అన్నగారి కూతురి పెళ్ళి ఈ ఊరిలో రేపు జరగనుంది. కూతురికి పుస్తెల్తాడు చేయిస్తానని పెళ్ళివారితో చెప్పిన వెంకటపతి అన్నగారు లక్ష్మీపతి. బంగారం తమ్ముడికిచ్చి వెంకటపతి ఉండేది పల్లెటూరు గనుక అక్కడ చేయించుకురమ్మని చెప్పాడు. పెళ్ళికూతు

రికి మట్టెలూ, మంగళసూత్రాలు తను చేయించి అవీ, అన్నగారు చెప్పిన బంగారు గొలుసూ తీసుకుని భార్యా బిడ్డలతో ప్రయాణ మయ్యాడు. ఇక్కడ రైలుదిగే హడావుడిలో సామాన్లు అన్నీ తమతో తీసుకువెళ్ళి, సీటుక్రిందగా పెట్టిన ఈ సంచీ మాత్రం మరిచే పోయారు. సగం దూరం వెళ్ళాక గుర్తొచ్చి దొరుకుతుందనే ఆశలేక పోయినా చూస్తేతే వస్తామనుకుని వచ్చాడు.

వెంకటపతి ఈ విషయాలన్నీ చెప్పి, "ఇక మీ వివరాలు చెప్పండి। నానుండి మీకేదైనా సాయం అవసరమైతే చేస్తాను." అని తిరిగి తనే మాట్లాడాడు—"మా ఊరిలో నేను చిన్నవ్యాపారం చేసుకుంటున్నాను. ఈరోజు ఆ నగ పోతే మరోటి చేయించి ఇవ్వ గలను. డబ్బుకొరకు కాదు-నాబాధ. కాని అంతమందిలోనూ మగ పెళ్ళివారి ఎదుట నేనూ, మా అన్నయ్య ఎంత అవమానాలపాలు కావల్సి వస్తుందోనని చాలా బాధపడ్డాను. మీరు సమయానికి నాకు నా వస్తువు నందించి పరువు కాపాడారు. అందుకు డబ్బుకన్నా మాట లకి విలువనిచ్చే నేను మీకు ఎంతగానో ఋణపడి ఉన్నాను. తృణమో, పణమో చేపి చేతులు దులుపుకుంటున్నానని అనుకోకండి। కొంతలో కొంత నాశక్తిమేర మీకు సహాయం చెయ్యగల్గితే అది అదృష్టంగా భావిస్తాను. చెప్పండి। నేనెలా సహాయ పడగలను?"

త్యాగరాజశర్మ కళ్ళుమూసుకున్నాడో నిముషం.

"నాపేరు మృత్యుంజయశర్మ. ఈతను నా నమ్మిన బంటు వెంకన్న. వీడు నా కుమారుడు. ఉన్న ఊరిలో పిత్రార్జితాలూ, స్వార్జి తాలూ కాలగర్భంలో కలిసిపోగా ఉదరపోషణార్థమై ఈఊరు చేరాం."

ఆ తరువాత బస్సురావడంతో వాళ్ళ సంభాషణ మరి సాగ లేదు.

పెళ్ళివారిల్లు చేరుకున్నారు.వెంకటపతి కొరకే ఎదురు చూస్తున్న లక్ష్మీపతి ఖంగారుగా ఎదురువచ్చి ఆత్రంగా అడిగాడు-

"ఏరా పతీ, సంచీ దొరికిందా?"

"ఆఁ దొరికిందన్నయ్యా। ఇదిగో వీరిపేరు మృత్యుంజయశర్మ గారు. ఆ సంచీ వీరికి దొరికింది. స్వంతదారుడు రాకపోడంటూ రైలుదిగి అరగంటైనా అక్కడే నిరీక్షిస్తూకూర్చున్నారు.అంతలోనేనువెళ్ళాను."

మూడు ముక్కలలో సొమ్ము దొరికిన వైనమూ త్యాగరాజశర్మ పరిచయమూ ముగించాడు వెంకటపతి.

"అలాగా! మీకు ఎలా కృతజ్ఞతలు చెప్పాలో తెలియటంలేదు. మీలాంటి వారు నూటికో్కటి కోకరు కూడా ఉండరు. నల్గురిలో మా అన్నదమ్ముల పరువు పోకుండా కాపాడారు. మీ మేలు జన్మలో మరువలేను."

చేతులు జోడించాడు లక్ష్మీపతి.

"మీ వస్తువుని మీ కప్పగించాను. ఇందులో నా గొప్పదన మేముంది?"వి సున్నితంగా తప్పుకున్నాడు త్యాగరాజశర్మ.

వెంకటపతి శర్మవద్దకు వచ్చి, "మీరు బ్రాహ్మణులు కదా! మా ఇంట్లో ఎలాగూ భోజనం చేయరు. నాకేం తెలుసు? వంటకి కావల్సిన సరకులూ, సామానులూ పంపించుతాను. వంట చేసుకుని తినండి!" అన్నాడు.

"లేదు పతిగారూ! నాకు కులాలు, మతాలని లేదు. పరిశుభ్ర మైన దుస్తులతో ఎవరు వంట చేసినా తింటాను. కాని ఇపుడు కాదు. ఇపుడు మీరు వంట సామాన్లూ గట్రా ఏవీ పంపనక్కరలేదు. మీకు చేతనయితే ఓ సహాయం చెయ్యండి!"

"ఏమిటో చెప్పండి!"

"ఏమీలేదు పతిగారూ! మీ పెళ్ళి హడావుడి సద్దుమణిగాక ఎక్కడైనా తక్కువ అద్దెలో చిన్న గది చూసి పెట్టండి-చాలు."

"ఎందుకంత తొందరపడుతున్నారు? కొన్నాళ్ళపాటు మా వాళ్ళింట్లో ఉండండి."

"లేదండీ! ఎవరినుండైనాసరే, ఉచితంగా సహాయం పొందడం ఇష్టముండదు. అందునా ఆర్థికసహాయం అసలే పడదు నాకు. మీకు ఈ చుట్టుప్రక్కల తెల్సినవారు చాలామంది ఉంటారు. పెళ్ళి బడలిక తీరాక అంటే మరో పదిరోజులవరకు చూడండి! అంతవరకూ ఏ గుళ్ళోనైనా తలదాచుకుంటాం. వస్తామండీ!" బయలుదేరబోయాడు శర్మ.

"ఏమిటీ, ఇప్పుడే వెళ్తున్నారా?"

"ఔనండీ, వెళ్ళాలి!"

"ఆగండాగండి! నాకింత సహాయం చేసినవాళ్ళు కనీసం పెళ్ళి భోజనమైనా చెయ్యకుండా వెళ్తారా? నేను వెళ్ళనిస్తాననే? ఈ రెండు రోజులూ మీరు ఎక్కడికీ వెళ్ళడానికి వీలులేదు."

"క్షమించండి! ఎవరినుండైనా సరే, ఉచితంగా సాయం పొందనని ఇదివరకే చెప్పాను."

"ఉచితంగా ఏమండీ! నాకు మరపురాని మేలు చేశారు."

"మీది మంచిమనసు గనక నా ధర్మం నేను నెరవేర్చినా దాన్ని గొప్పగా చేసి చెబుతున్నారు. మీ మంచితనాన్ని ఆసరా చేసుకుని మిమ్మల్ని నేను వాడుకుంటే-నా అంతరాత్మ నన్ను క్షమించదు. నన్నాపకండి!"

"మీరు అంతగా ఎందుకు అభిమానపడుతున్నారో నా కర్థం కావటంలేదు. నన్నెందుకంత పరాయివాడిలా చూస్తున్నారు?"

"క్షమించండి! మీరు మమ్మల్నింతగా బలవంతపెడితే మీకు చెప్పకుండా పారిపోవల్సి వస్తుంది. ప్రస్తుతం అంతకన్నా ఇంకేమీ చెప్పలేను."

"ఆ పని మాత్రం చేయకండి. నేనిప్పుడే వస్తాను. నేను వచ్చే వరకు వెళ్ళకండి!" అంటూ వెళ్ళిన వెంకటపతి ఓ అరకంటకల్లా తిరిగివచ్చి, "మా అన్నగారు ఒకప్పుడు పిండిమర నడిపేవారు. తర్వాత మరని అమ్మివేశారు. కాని ఆ గదిమాత్రం ఇన్నిరోజుల నుండి ఊరికే ఉంటున్నది. ఇపుడే ఆ గదిని శుభ్రంగా కడిగించి వచ్చాను. మీరందులో ఉండవచ్చు!" అన్నాడు.

ఆశ్చర్యపోయాడు త్యాగరాజశర్మ. ఇంత పెద్ద హైదరాబాద్ నగరంలో తమకింత తేలిగ్గా గది దొరుకుతుందనుకోలేదతను.

"మీరు నాకొరకు చాలా శ్రమ తీసుకొన్నారు. పెళ్ళి హడావుడిలో ఉన్న మీరు మాకొరకు ఇంతగా కష్టపడవల్సింది కాదు. పెళ్ళి విందులు ఐపోయాక మేము వస్తే బాగుంటుంది. అసలు మీరు రమ్మన్నప్పుడు ఇంతపెద్ద నగరంలో తెల్సిన వారిల్లు ఒకటి ఉంటే మంచిదనుకుని వచ్చాంగాని, మిమ్మల్నింత ఇబ్బందులకు గురి చేయవల్సి వస్తుందని తెలిస్తే వచ్చేవాళ్ళం కాదు."

"ఇబ్బంది ఏమీ లేదు. మీరు త్వరగా అక్కడికి పదండి!"

"సరే, ఇంతకూ అద్దె ఎంతో చెప్పండి!"

"అద్దె ఇస్తారా? అవసరంలేదు-పదండి!"

"అలాగైతే ఇల్లు మాకు అవసరం లేదు."

వెంకటపతి చిరునవ్వు నవ్వాడు.

"మీతో చాలా చిక్కే వచ్చింది. సరే ఎంతో కొంత, మీకు తోచినంత ఇయ్యండి!" అంటూ వాళ్ళని తీసుకువెళ్ళి గది చూపించాడు.

త్యాగరాజశర్మ విధుమౌళినీ, వెంకన్ననీ ఇంట్లో ఉంచి, తను బజారుకు వెళ్ళి, వంట చేసుకునే పాత్రలు కొన్నీ, కొద్దిగా బియ్యం మిగతా వంట సరంజామా తెచ్చారు. వెంకటపతీ, లక్ష్మీపతీ ఎంత చెప్పినా వినకుండా మొదటి నెల అద్దెకూడా ఇచ్చేశాడు.

ఆ తరువాత పెళ్ళి ఘనంగా జరిగింది. త్యాగరాజశర్మ పెళ్ళికి వెళ్ళి పెళ్ళికూతురికి ఒక చీరా, రవికగుడ్డా, కుంకుమపెట్టె ఇప్పించారుగాని, "మనల్ని వాళ్ళు ఆదరించినందుకు నల్గురిలో హేళన గావింపబడ కూడదం'టూ వెంకన్ననీ, విధుమౌళిని కూడా పెళ్ళి భోజనానికి పంపించలేదు.

వెంకటపతి వచ్చి అడిగితే, "మరోలా భావించక క్షమించి మమ్మల్ని వదిలేయండి!" అన్నాడు.

మరి మాట్లాడలేకపోయాడు వెంకటపతి.

* * *

పెళ్ళై వారం రోజులు దాటినా వెంకటపతి ఇంకా తన స్వగ్రామం బయలుదేరలేదు. పిల్లలు హైదరాబాద్‌లో చూడవల్సిన వన్నీ చూపిస్తున్నారు. అన్నీ చూశాక వెళ్ళొచ్చని లక్ష్మీపతి అంచే అన్నగారి మాట కాదనలేక ఉండిపోయారు. ఆ రోజు పిల్లలంతా ఊరు చూడ్డానికి వెళితే తను రాలేనంటూ ఇంట్లోనే ఉండిపోయాడు వెంకటపతి.

బజారుకు వెళ్ళి వచ్చిన లక్ష్మీపతి, "ఏరా! నీవు వెళ్ళలేదేం?" అని అడిగాడు.

"ఆఁ! అన్నీ నేను చూపినవేగా, పైగా ఓపిక కూడాలేదు."

"సరే! ఐతే భోజనం చేసి విశ్రాంతి తీసుకో!"

వెంకటపతీ, లక్ష్మీపతీ భోజనాలు చేసి పందిరి క్రింద రెండు మంచాలు వేసుకుని మేనులు వాల్చి పిచ్చాపాటీ మాట్లాడుకుంటున్నారు. వాళ్ళ ఊరి విషయాలూ, వ్యాపార విషయాలు, బంధువుల విషయాలు, స్నేహితుల కబుర్లూ అన్నీ వాళ్ళ మాటలమధ్య దొర్లుతున్నాయి. హఠాత్తుగా వెంకటపతి ఏదో గుర్తొచ్చిన వాడిలా—
"ఆఁ అన్నయ్యా! గోపాలం ఇప్పుడేం చేస్తున్నాడు?" అడిగాడు.

"వాడా? వాడా మధ్య ఏవో సంస్కృత పరీక్షలిచ్చి ఉత్తీర్ణుడయ్యాడుగా! అదే విద్యని పిల్లలకు నేర్పించడానికి ఇప్పుడో పాఠశాల నడుపుతున్నాడు" లక్ష్మీపతి సమాధానం.

"అలాగా! బాగా జరుగుబాటు అవుతుందిటనా?"

"ఆఁ చాలామంది పిల్లలే చేరారుట. ఐనా వీడికి ఆ పిల్లలిచ్చే డబ్బుతోనే గడవాలని లేదుగా! వాళ్ళ తాతగారు సంపాదించిన ఆస్తి చాలానే ఉందిగదా! అదంతా అమ్ముకుని ఆ డబ్బుతో ఇక్కడ చేరాడు. ఇప్పుడు పాఠశాల గూడా తెరిచాడు. దానిమీదే సంసారం జరక్కున్నా ఏదో పై ఖర్చులకి సరిపోతుందని ఆ మధ్య ఎప్పుడో కల్సినపుడు చెప్పాడు."

ఆ తరువాత వారి సంభాషణ వేరే విషయాలలోకి మారింది.

భోజనాలు చేసి బయటకి వచ్చి చేతులు కడుక్కుంటున్న త్యాగరాజశర్మ అన్నదమ్ముల మాటల్ని శ్రద్ధగా విన్నారు. వెంటనే తన గదిలోనికి వెళ్ళి ధోవతి మార్చుకుని, భుజాన కండువా ఒకటి వేసుకుని గబగబా అన్నదమ్ములున్న చోటికి వచ్చారు.

"రండి శర్మగారూ!" అంటూ ఒక కుర్చీ తెచ్చి వేశారు వెంకటపతి

త్యాగరాజశర్మ వెంకటపతికి తన్ను తాను పరిచయం చేసుకున్న రోజున ఎన్నోవిధాలుగా ఆలోచించి తనపేరు మృత్యుంజయ శర్మగా చెప్పాడు. 'ఆ పేరునైతే తన పాతజీవితాన్ని ఎవరూ గుర్తుపట్టలేరు. ఒకవేళ ఎవరైనా గుర్తుపట్టినా తను కాదని చెప్పవచ్చు'నుకున్నాడు. తనపేరు మృత్యుంజయశర్మగా పరిచయమైన రాత్రి తమ అద్దె గదిలో కొడుకునీ, వెంకన్ననీ కూర్చోబెట్టుకుని—

"బాబూ! ఇక్కడనుండీ నా పేరు మృత్యుంజయశర్మ.

అందరూ అలాగే పిలుస్తారు. నీవూ, వెంకన్న కూడా ఎవరైనా నన్ను గురించి అడిగినప్పుడు నా పేరులో పొరపాటు రాకుండా చూసుకోండి. నా పాతపేరు మారిపోయింది. పాతవిద్యా మారి పోయింది. కొత్తపేరులో సరికొత్త జీవితమే మనకు రాబోతుందని నా విశ్వాసం. నా నమ్మకమెప్పుడూ వమ్ముకాదు" అన్నారు.

"నాన్నగారూ! పేరు మార్చుకుని కొత్త పేరైతే పెట్టుకో గలంగాని, వచ్చిన విద్యని మార్చి, మరోవిద్యని నేర్చుకోలేం కదా?" విధుమౌళి ప్రశ్న అది.

కుమారుని ప్రశ్నకి ఓ క్షణం నిర్ఘాంతపోయినా, "శివా! మనకావిద్య అచ్చుబాటు గానప్పుడు వదలి వేరే విద్యని నేర్చుకున్నా తప్పులేదు. ఇంక నువ్వు పడుకో! చిన్నవాడివి, నీకేం తెలుస్తుంది?" అని కుమారుని నోరు మూయించాడు.

'విధుమౌళి' అని కొడుక్కి తండ్రిపేరు పెట్టుకున్నా, ఎప్పుడో తప్ప సాధారణంగా కొడుకుని 'శివా!' అనే పిలుస్తారు త్యాగరాజశర్మ. అలా మృత్యుంజయశర్మగా అందరిచేత పిలువబడుతున్న త్యాగరాజ శర్మని, 'శర్మగారూ!' అని పిలుస్తాడు వెంకటపతి. త్యాగరాజశర్మ మాత్రం వెంకటపతిని, 'పతిగారూ' అనీ, లక్ష్మీపతిని 'లక్ష్మీపతి గారూ' అంటూ పిలుస్తాడు.

కుర్చీలో కూర్చున్న శర్మ కొద్దిసేపు మౌనంగా ఉండి ప్రారంభించారు.

"పతిగారూ! మీరు ఇప్పటికే చాలా సహాయం చేశారు. మళ్ళీ అడగడానికి నోరు రావడంలేదు. కాని తప్పదుగనుక అడుగు తున్నాను."

"ఏమిటీ? మీరు మానుండి చాలా సహాయం అందుకున్నారా? ఒక ఇల్లు ఇవ్వడం తప్పించి మానుండి ఎటువంటి లాభమూ మీకు కల్గలేదు. అదికూడా అద్దె ముందుగానే ఇచ్చారు గదా? సరే, ఆ విషయమలా ఉంచండి. ఏదో చెప్పబోయి ఆపారు. ఏమిటది? అడగండి! మా ఇద్దరిలో ఎవరివల్లనైనా సరే, ఆ పని కాగలదంటే తప్పక చేస్తాం."

వెంకటపతిమాటలకు త్యాగరాజశర్మకి కొండంత ధైర్యంవచ్చింది.

"మీరు ఇందాక ఎవరో గోపాలంగారిని గురించి మాట్లాడు కున్నారు. వారు ఎక్కడ ఉంటారో వివరాలు వ్రాసిస్తారా?"

"ఎందుకు? వాడితో మీకేం పని?"

"వారు ఏదో పాఠశాల నడుపుతున్నారని మీ అన్నగారు మీతో అంటుండగా విన్నాను."

"ఔను. సంస్కృత పాఠశాల నడుపుతున్నాడు. ఐతే..."

"వారి పాఠశాలలో నన్ను అధ్యాపకుడిగా చేర్చుకుంటారేమో ....నని"

"నిజమే....కాని అందుకు సంస్కృత విద్య కొద్దిగానైనా వచ్చి ఉండాలి కదా?"

"ఔను! నాకూ అందులో కొద్దిగా ప్రవేశం ఉంది."

"అలాగా! నాకింతవరకు తెలియదు. మీరు కొంత వచ్చు అంటున్నారంటే అందులో పండితులై ఉండాలి. మిమ్మల్ని మీరు గొప్పచేసి చెప్పుకోవడం మీకు చేతగాదు." అని, "అన్నయ్యా! విన్నావుగదా! వాడి ఇల్లదీ నీకుతెల్సుగా, రేపు వీరిని తీసుకువెళ్ళి సంస్కృత పండితులుగా పరిచయం చెయ్యి. ఏమైనా అవకాశాలుంటే తప్పక వీరిని చేర్చుకోమని చెప్పు!" అన్నాడు వెంకటపతి.

లక్ష్మీపతి వెంటనే అన్నాడు-"రేపటివరకు ఎందుకురా? నీవు గూడా రాకూడదూ! ఈరోజు సాయంకాలమే వెళ్దాం. అలాగే వాడు కూడా నిన్ను చాలా రోజులనుండి అడుగుతున్నాడు. చిన్నప్పుడు వాడు మనతో ఎంత స్నేహంగా ఉండేవాడు? ఏమిటో ఆ రోజు లిప్పుడు రావు" నిట్టూర్చాడు.

"ఔనన్నయ్యా! నాకూ వాడిని చూడాలని ఉంది. తప్పకుండా వెళదాం. శర్మగారూ! సాయంకాలం వెళదాం! మీరు తయారుగా ఉండండి!"

శర్మ తటపటాయిస్తూ, "ఉంటాను. గాని మీరు నాకో మాటి య్యండి నన్ను వారికి పండితునిగా పరిచయం చెయ్యద్దు. వారెంత పండితులో ఏమో! వర్షాకాలపు చదువునాది!"

నిండుకుండ త్యాగరాజశర్మ. కడుపునిండా విద్య ఉన్నా పైకి తొణకడు.

చిరునవ్వు నవ్విన వెంకటపతి-"అలాగే లెండి!" అనక తప్ప లేదు-త్యాగరాజశర్మ ముఖం చూశాక.

త్యాగరాజశర్మ తనగదిలో విశ్రాంతి తీసుకోవడానికి వెళ్ళాడు. అతను వెళ్తుంటే లక్ష్మీపతి తమ్ముడితో అన్నాడు- "ప్చ్. సత్యకాలపు బ్రాహ్మణుడు. ఎలా ఈ ప్రపంచంలో నెగ్గుకొస్తాడో ఏమో!" అని.

వెంకటపతి మాట్లాడకుండా ఔనన్నట్టు తలాడించాడు మౌనంగా.

* * * *

'గోపాలం!' అని అన్నదమ్ములు మాట్లాడుకున్న సదరు వ్యక్తిపేరు గోపాలరావు. గోపాలరావు, లక్ష్మీపతి, వెంకటపతి చిన్నప్పటి నుండి చాలా స్నేహంగా ఉండేవారు. గోళీకాయలాడటంనుండి గోదావరిలో ఈదేవరకూ ముగ్గురూ కల్సే చేసేవారు. వాళ్ళ ముగ్గురినీ ఒకే సారి గాక విడివిడిగా చూపినవాళ్ళు అరుదు. నిజానికి లక్ష్మీపతి మిగతా ఇద్దరికన్నాకూడా చాలాపెద్దే. ఐనా తనతోటి పిల్లలతో కాకుండా వీళ్ళిద్దరితోనే స్నేహంగా ఉండేవాడు. గోపాలరావు, వెంకటపతి ఒక్క ఈడువాళ్ళు. లక్ష్మీపతి వాళ్ళిద్దరికన్నా ఆరేడు సంవత్సరాలు పెద్దవాడు.

సాధారణంగా అన్నదమ్ములంటే చిన్నప్పటినుండి కొట్టుకుంటూ, తిట్టుకుంటూ ఉంటారు. కాని వెంకటపతి, లక్ష్మీపతి, చిన్నతనంలోనే కాక పెద్దవారై పెళ్ళిళ్ళు చేసుకున్నాగూడా స్నేహితుల వలెనే మెలగుతారు. ఒకళ్ళంటే మరొకళ్ళకెంతో అభిమానం. ఉన్న ఊరువిడచి వ్యాపార నిమిత్తం లక్ష్మీపతి హైదరాబాద్ వచ్చినా తమ్ముణ్ణి చూడ్డానికి ఏదో నెపంతో తరచూ తన ఊరు వెళ్తుంటాడు.

లక్ష్మీపతి హైద్రాబాద్ చేరిన తర్వాత గోపాలరావు గూడా హైదరాబాద్ చేరాడు. సంస్కృత పరీక్షల నిమిత్తమై మధ్య మధ్య స్నేహితులిద్దరూ కల్సుకునేవారు. అటు తర్వాత కొద్ది రోజులకే గోపాలరావు ఉన్న ఆస్తినంతా తెగనమ్మి కుటుంబంతో సహా హైద్రాబాద్ చేరాడు.

* * *

"రండి! రండి! రామలక్ష్మణు లిరువురికీ ఈరోజైనా మా

మీద దయకలిగింది" అంటూ సాదరంగా ఆహ్వానించాడు గోపాల రావు. ఆయన వెంకటపతిని ఆలింగనం చేసుకుని భుజం చుట్టూ చేతులు వేసి,

"ఒరే పతీ! నన్ను మరచిపోయావుటరా! ఇన్నిసార్లు ఈ వూరు వచ్చినా మా ఇంటికి రాకుండా పోయావు" అడిగాడు ఎంతో స్వతంత్రంగా.

వెంకటపతి కూడా గోపాలరావుని చుట్టుకుని, "లేదురా! అన్నయ్యా, నువ్వూ, నేనూ - మన ముగ్గురిలో ఒకళ్ళ నొకళ్ళు మరచిపోవటం జరిగితే అది ప్రాణమున్న మనుషులుగా మాత్రం కాదు" అన్నాడు.

"నిజమేరా! జీవనభృతి కొరకు ముగ్గురం మూడు మార్గా లేర్ప రచుకున్నా మన ముగ్గురి స్నేహం మట్టుకు ఒకనాటితో చెరిగి పోయేది కాదు."

ఈవిధంగా మాట్లాడుకుంటూ చిన్ననాటి విషయా లెన్నో చర్చించుకున్నారు. మధుర స్మృతులెన్నో తలచుకున్నారు. అలా.... రెండు గంటలు రెండు నిముషాల్లా దొర్లినాయి వారిమాటల్లో. లక్ష్మీ పతికిగాని, వెంకటపతికిగాని తమతో త్యాగరాజ శర్మని తీసుకు వచ్చా మనీ, అతన్ని గోపాలరావుకి పరిచయం చేయాలనీ గుర్తు రాలేదా క్షణంలో.

ముగ్గురు స్నేహితులు మాట్లాడుకునే మాటలు వింటూ ఆ గది నంతా పరీక్షించుతూ కూర్చున్నాడు త్యాగరాజశర్మ. గది చిన్నదే ఐనా ఎక్కడి వస్తువులు అక్కడ సర్ది ఉన్నాయి. అద్దంలా పరిశుభ్రంగా ఉందా గది. అన్నింటికన్నా త్యాగరాజశర్మని ఆకర్షించిన దృశ్యం ఒక గూటిలో అందంగా అమర్చబడిన పుస్తకాలు. అవి కొన్ని సంస్కృతం-కొన్ని తెనుగు-మరికొన్ని ఇంగ్లీషువి. అలా గూటిలో అమర్చిన పుస్తకాలనూ, వాటిని అందంగా అతి శ్రద్ధగా అమర్చిన తీరునీ చూస్తూ కూర్చున్నాడు త్యాగరాజశర్మ.

కొందరిని కాస్సేపు ఊరికే కూర్చోమంటే చాలు. గోళ్ళు గిల్లు కుంటూనో, దగ్గుతూనో, తుమ్ముతూనో, చేతులు ఆడిస్తూనో, చిటి కలు వేస్తూనో, మాటిమాటికి ఆవలిస్తూనో, ఒళ్ళు విరుస్తూనో రక

రకాల పిచ్చిచేష్టలు చేస్తూ రామబంటుకి నిజమైన వారసుల్లా ప్రవర్తి స్తారు. కాని త్యాగరాజశర్మ రాగానే కుర్చీలో కూర్చున్న తరువాత వాళ్ళింకా తనని పరిచయం చేయలేదనీ, లేక చేయాలనీ, ఏవిధమైన వంకర చేష్టలూ చేయలేదు. సహనం ఆయనకి భగవంతుడు ప్రసా దించిన అపూర్వమైన వరం.

అలా.....అలా.....రెండు గంటలు గడచిన తరవాత హఠాత్తుగా ఈ లోకంలోనికి వచ్చిన లక్ష్మీపతి చాలా నొచ్చుకున్నాడు.

"ఒరే పతీ! ఇంక నీ మాటలు ఆపు! మనతో శర్మగారిని తీసుకు వచ్చామని మనం మరచిపోవటం- పాపం వారిని ఎంత ఇబ్బందికి గురిచేస్తుందో ఇంతసేపట్నుంచీ మనం గుర్తించనే లేదు. క్షమించండి శర్మగారూ! మీ కింతవరకు వీడిని పరిచయం కూడా చేయనందుకు ఏమనుకోకండి! వీడే మా బాల్యస్నేహితుడు గోపాలం! వీరు మృత్యుంజయ శర్మగారు! ఓ సందర్భంలో మా అన్నదమ్ముల పరువు కాపాడిన ఉత్తములు."

పరస్పర పరిచయం చేశాడు లక్ష్మీపతి. నమస్కారాలు ప్రతి నమస్కారాలు ముగిసాక కొద్దిసేపటికి వెంకటపతి అసలు విషయం బయట పెట్టాడు.

"ఒరే గోపాలం! శర్మగారికి కూడా సంస్కృత విద్యలో కొంత ప్రవేశం ఉందట! నీవు నడిపే పాఠశాలలో వీరిని ఉపాధ్యా యులుగా చేర్చుకునే అవకాశ మేమైనా ఉందా?" అని.

గోపాలరావు కొద్ది క్షణాలు ఆలోచించి- "నిజమే! నాకూ మరో ఉపాధ్యాయుడు అవసరమే. కాని విద్యార్థులకి బోధించే విధానం చూసి గాని ఏ విషయం చెప్పలేను. రేపటినుండి వీరిని రమ్మను. నాల్గు రోజులు వీరి బోధనా పద్ధతులు చూసి నచ్చితే తప్పక చేర్చుకుంటాను" అన్నాడు.

అటు తరవాత భోజనం చేసిపొమ్మని గోపాలరావు ఎంతో బల వంతం చేశాడు గాని, మరోసారి వస్తామంటూ వాళ్ళిచ్చిన పాలు మాత్రం తీసికొని ఇంటికి తిరిగి వచ్చేశారు ముగ్గురూ!

* * *

నాల్గు రోజుల పాటు విద్యార్థులకి సంస్కృత విద్యని బోధిం

చిన త్యాగరాజశర్మ నాల్గోనాడు సాయంకాలం గోపాలరావు దగ్గరకు వెళ్ళి, "గోపాలరావుగారూ! నాల్గురోజులు నా బోధన చూశారు గదా! రేపటినుండి రమ్మంటారా? అవసరం లేదా?" అనడిగాడు.

గోపాలరావు త్యాగరాజశర్మ చేతులు పట్టుకుంటూ, "శర్మ గారూ! మిమ్మల్ని చూసిపుడు మీరింత పండితు లనుకోలేదు. అసలు ఇందులో పదోవంతైనా నేను మిమ్మల్ని ఊహించుకో లేదు. నేను పరీక్ష లిచ్చి ఉత్తీర్ణుడ నయ్యాను గాని, మీముందు నా విద్య సూర్యుడి ముందు దివిటీ లాంటిది. చెబుతున్నాను- వినండి! మీరు మమ్మల్ని, ఈ పాఠశాలనీ విడవాలనుకున్నా మేము మాత్రం మిమ్మల్ని విడిచేది లేదు."

అలా సంస్కృత పాఠశాలలో అధ్యాపకుడిగా చేరిన త్యాగ రాజ శర్మని మృత్యుంజయ శర్మ రూపంలో అదృష్టం నిజంగానే వరించింది. చక్కని విద్యాబోధన కల్గిన ఆ పాఠశాలకి త్వరలోనే ప్రజలనుండి గుర్తింపు కల్గింది. చాలామంది సంస్కృత విద్యాభ్యాసానికి ముందుకు వచ్చారు. కొద్దికాలంలోనే ప్రభుత్వంవారి చేయూత కూడా అందడంతో ప్రభుత్వ సహకారంతో, ప్రజల ఆదరాభిమానాలతో మరింతగా కృషిచేసి ఆ పాఠశాలని మరింతగా అభివృద్ధి లోకి తెచ్చాడు గోపాలరావు.

ఆయనకు శర్మ కాలుపెట్టిన వేళా విశేషమూ, వాక్పటిమా, పాండిత్యమూ వల్లనే తను నడిపే పాఠశాలకింత పేరు ప్రతిష్టలు వచ్చాయని నమ్మకం. త్యాగరాజ శర్మకి కూడా గోపాలరావంటే ఎనలేని విశ్వాసం! నిరాధారమైన తమ జీవితానికి ఆశాజ్యోతి చూపించినవారు ఆయనే అన్న భావం ప్రతిక్షణం గుండెల్లో కదలాడుతూ ఉంటుంది. మొదట్లో అంటే త్యాగరాజశర్మ గోపాలరావు నుండి మొదటినెల జీతం అందుకునే రోజున ఆయన మాటలు విన్న శర్మ ఇంక ఈ ఉద్యోగానికి కూడా స్వస్తే కాబోలు ననుకున్నారు. కాని అలా జరుగలేదు.

ఆ రోజు గోపాలరావు త్యాగరాజశర్మకి తొలి జీతం ఇస్తూ అడిగాడు.

"శర్మగారూ! నే నొకటి అడుగుతాను- చెబుతారా?"

"అడగండి!"

"మీకు సంగీతం వచ్చా?"

అపశృతి విన్న సంగీత విద్వాంసుడిలా ఐపోయాడు త్యాగరాజ శర్మ. 'తనకీ ఉద్యోగమూ ప్రాప్తిలేదు. అయిపోయింది. ఈ డబ్బు తీసుకొని ఇంక రావద్దంటాడు. భగవంతుడా! నాకు అడుగడుగునా ఈ సంగీత విద్య అవరోధంగా ఎందుకు చేస్తున్నావు?' అంటూ భగవంతుడినీ, సంగీత విద్యనీ మనసులోనే తిట్టిపోశాడు.

"ఏమిటి శర్మగారూ! మాట్లాడరేమిటి? నే నేమైనా తప్పుగా అడిగానా?" అడిగారు గోపాలరావు.

"లేదు- లేదు-ఏమీ లేదు." త్యాగరాజశర్మ తడబాటు.

"ఓసారి మా బావమరిదిగారి ఊరు వెళ్ళినప్పుడు అక్కడ ఒక సంగీత సభ జరిగింది. అక్కడ గానం చేసిన వారు అచ్చం మీలాగే ఉన్నారు. అసలు ముందు మా వెంకటపతి పరిచయం చేసినప్పుడే గుర్తుపట్టి అడగాలనకున్నాను. కాని పరిచయం లేకుండా అడక్కూడదని మానుకున్నాను. మీరు సంగీతం చాలా బాగా పాడ గలరు గదూ?"

త్యాగరాజశర్మ ముఖం పాలిపోయింది. లేని బలాన్ని కూడ దీసుకుంటూ అన్నాడు-

"మీరు మా కవల సోదరుడు త్యాగరాజశర్మ గురించి మాట్లాడుతున్నారు. మీరన్నట్లు ఆయన చాలా బాగా పాడేవారే. కాని ఆయన ఆరు నెలల క్రితం గుండెపోటుతో మరణించాడు. ఇప్పుడు లేడు."

"అరెరె! ఆయనా, మీరూ కవలపిల్లలా?" గోపాలరావు ఆశ్చర్యం.

"ఔను. మే మిద్దరం అచ్చుబోసినట్లు ఒకే తీరుగా ఉండే వాళ్ళం. కాని విద్యల్లో మట్టుకు పరస్పర విరుద్ధం. ఆయనకు సంగీతం తప్ప మరో విద్య రాదు నాకు సంస్కృతం తప్ప మరో విద్య రాదు. అసలు సంగీతంలో ఓ, నా, మాలే నాకు తెలియవు."

ఎంత స్థిరంగా అనాలనుకున్నా చివరి మాటలంటున్నప్పుడు ఆయన కంఠం రుద్ధమయ్యింది. పెదవులు వణికాయి. మనస్సు త్రొక్కులాడింది, శరీరం కంపించింది. కళ్ళు నీళ్ళతో నిండాయి.

శర్మ పరిస్థితిని వేరుగా అర్థం చేసుకున్న గోపాలరావు, "వారూ మీరు సోదరులనీ, వారు గతించారనీ తెలియక అడిగాను. మీ మనసు బాధపెడితే క్షమించండి!" అన్నాడు.

"లేదు-లేదు....మీరలా అనుకోకండి! వాడు మరణించినా నిరంతరం నా గుండెల్లోనే కదులాడుతూ నా ఎదలో భద్రంగా ఉంటాడు. నేను మరచిపోతేకదా, మీరు గుర్తుకి తెచ్చి నన్ను బాధ పెట్టేది!" అంటూ గుండెల్లో కదలాడే సంగీత విద్య గురించి మర్మగర్భంగా చెప్పాడు శర్మ. ఆ తరువా తెప్పుడూ గోపాలరావూ త్యాగరాజశర్మల మధ్య సంగీత విద్యని గురించిన ప్రసక్తి రాలేదు.

* * *

త్యాగరాజశర్మ తన కుమారుణ్ణి కూడా సంస్కృత పాఠశాలలో చేర్పించాడు. చిన్నప్పటి నుండి ఎంత కష్ట సుఖాల్లో ఉన్నా రోజుకో గంటైనా కుమారునికి సంగీత విద్య బోధించటం ఆయన దినచర్యల్లో ఒకటి అలా స్వతహాగా తెలివైనవాడు, సుశిక్షితుడూ, చురుకైనవాడూ అయిన విధుమౌళి పాఠశాలలో అందరికన్నా ప్రథమ శ్రేణిలో ఉండేవాడు.

అతన్ని చూస్తే గోపాలరావుకి చాలా ఆనంద మయ్యేది. ఆ పిల్లవాణ్ణి ఎంతగానో అభిమానించే వాడు. గోపాలరావుకి ఆ తండ్రీ కొడుకులంటే వల్లమాలిన ప్రీతి. ఆయనే త్యాగరాజశర్మచే సంస్కృత పరీక్షలు కట్టించారు.

"గోపాలరావుగారూ! నా కెందుకీ పరీక్షలు? ఏదో మీ దయ వల్ల కడుపునిండా ఇంత తింటున్నాం గదా?" అని శర్మ అంటే—

"మీరలా అనుకో కూడదు! డిగ్రీలు లేని విద్య వాసన లేని పువ్వు వంటిది. డిగ్రీలు లేకుంటే ఎంత పండితునికైనా గుర్తింపు ఉండదు. మీరు తప్పక పరీక్షలు కట్టాలి!" అన్నాడు.

"ఈ వయసులో పరీక్షలు కట్టాలంటే వాటికి చాలా శ్రమ

పడాలి. అదంతా నా నుండి కాదు." శర్మ దైన్యంగా అన్న మాటలకి-

"అదంతా నాకు వదిలేయండి! చక్కగా చదవటం, ఉత్తీర్ణులు కావటం ఈ రెండే మీ ధ్యేయాలు. గుర్తుంచుకోండి!" అంటూ పరీక్ష వ్రాయడానికి త్యాగరాజశర్మకి కావల్సిన ఏర్పాట్లన్నీ అత్యంత ప్రయాసం కోర్చి గోపాలరావే చేశాడు. త్యాగరాజశర్మ ఆయన ఇవ్వమన్న పరీక్షకల్లా చదివి ప్రథమ శ్రేణిలో ఉత్తీర్ణుడయ్యే వాడు.

అన్నీ ఆయన చదివిన పుస్తకాలే కావటం వల్లనూ, ఒకటి, అరా చదవనివున్నా ఏకసంతగ్రాహి కావడం వల్లనూ త్యాగరాజశర్మ ఇచ్చిన పరీక్షల్లో ఏ ఒక్కటి కూడా తప్పటమంటూ జరగలేదు. సంస్కృతంలో బి. ఏ. పరీక్షకి కడుతున్నప్పుడు ఒక పేపరు ఆంగ్లంలో కూడా వ్రాయవల్సి వచ్చింది. ఐతే ఈ విషయంలో ముందుగానే జాగ్రత్త తీసుకుని త్యాగరాజశర్మకి తానే పూనుకుని ప్రతిరోజు ఆంగ్ల భాషని బోధించి ఆ పరీక్షకి సిద్ధంగా శర్మని తయారు చేయడం వల్ల బి. ఏ. పరీక్ష కూడా ఉత్తీర్ణుడయ్యాడు. ఆ విధంగా బి. ఏ. పరీక్ష ఉత్తీర్ణుడయిన శర్మ యం. ఏకి కట్టటం, ప్రభుత్వం సహకారంతో గోపాలరావు పాఠశాల కళాశాలగా మారటం ఒకేసారి జరిగింది. అదే సమయంలో తాగరాజశర్మ జీవితంలో మరో ఎదురు లేని అఘాతం సంభవించింది.

* * *

ఆ రోజు శుక్రవారం. కళాశాల విద్యార్థులంతా రామప్ప గుడి, పాకాల చెరువూ, వెయ్యి స్థంబాల మందిరమూ చూడాలనుకుని ప్రిన్సిపల్ గోపాలరావుతో మాట్లాడి శలవు మంజూరు చేయించుకున్నారు. ఒక్క విద్యార్థులేకాక కొంతమంది ఉపాధ్యాయులు గూడా వెళ్ళారు. త్యాగరాజశర్మ మాత్రం వంట్లో బాగాలేదని శలవు పెట్టిన తన కొడుకును చూడాలన్న ఆత్రంతో ఇంటికి బయలు దేరాడు. బస్సుదిగి ఇంటికి నడక సాగించాడు. ఆయన గోపాలరావు పాఠశాలలో అధ్యాపకుడుగా చేరిన రెండు నెలలకే లక్ష్మీపతి ఇల్లు ఖాళీ చేసి మరో ఇంటికి వెళ్ళిపోయాడు.

ఆ ఇంటికి అద్దె చాలా తక్కువ. దయ్యాలున్నాయని చుట్టు ప్రక్కలవారు చేసే ప్రచారానికి భయపడి ఆ ఇంట్లో ఎవరూ అద్దెకు

దిగలేదు. త్యాగరాజశర్మ మాత్రం 'నిరంతరం- శివపంచాక్షరీ జప నిరతుండనైన నేనున్న ఇంట్లో దయ్యాలుండవు. ఒకవేళ ఉన్నా దేవతలుగా మారిపోతాయ'ంటూ ఎందరు చెప్పినా వినకుండా ఆ ఇంట్లో చేరిపోయాడు.

ఆయన చేరిన తర్వాత ఎన్నడూ దయ్యాలు కనిపించలేదు. కనీసం పీడకలలు కూడా ఎరగరు. ఆ ఇల్లు చాలా పెద్దది. వంట గదీ, దాన్నానుకొని దేవుడి గదీ, సామాన్లు పెట్టుకునేందుకు మరో గదీ విశాలమైన హాలూ, రెండు పడక గదులూ, స్నానాల గదీ, బావీ సమస్త సౌకర్యాలతో ఆ ఇంటిని కట్టించిన ఇల్లుగలాయన ఆ ఇంట్లో తన భార్య హఠాత్తుగా మరణించడం వల్లనో లేక ఒక్కగా నొక్క కూతురితో ఆ ఇంట్లో వుండలేకనో, కూతురితో సహా మదరాసు వెళ్ళి అక్కడ కాపురంపెట్టి ఈ ఇల్లు అద్దెకిచ్చాడు.

ఆలోచిస్తూ ఇంటివాకిలివద్దకి చేరిన శర్మ చుట్టూ పరికించి హఠాత్తుగా కనుబొమలు ముడివేశాడు. పరుగెత్తినంత వేగంగా నడుస్తూ తన పూజామందిరం చేరుకున్నాడు. అక్కడ కనిపించిన దృశ్యం చూసి స్థబ్ధుడయిపోయాడు.

పూజామందిరంలో శివలింగానికెదురుగా పులి చర్మంపై ఆసీనుడై తంబూరని ఒళ్ళో పెట్టుకుని అర్ధ నిమీలిత నేత్రుడై, ఈ లోకాన్నంతా మరచిపోయి, ఆనందపారవశ్యంగా 'ఎందరో మహానుభావులూ' అంటూ గానం చేస్తున్నాడు విధుమౌళి. ఇదీ శర్మకి ఆ ఇంట్లో కనిపించిన దృశ్యం.

'నా మాటని నిర్లక్ష్యం చేస్తున్నాడన్న మాట. లోగడ ఈ విషయమై నేను హెచ్చరించాను. విన్నట్టే విని ఎంతగా నటిస్తున్నాడూ?' మనసులో అనుకున్నాడు శర్మ.

లోగడ.........

ఈ ఇంట్లోకి అద్దెకి వచ్చిన క్రొత్తలో ఓ రోజు విధుమౌళి సంగీత సాధన చెయ్యడానికి బిళహరి రాగంలో ఆరోహణ, అవరోహణ పాడుతున్నాడు. వేసవికాలం రాత్రి 8 గంటలవుతుండప్పుడు. చల్లగాలికి వాకిట్లో కూర్చున్న వెంకన్న విధుమౌళినే

పరీక్షగా చూస్తున్నాడు. అదే సమయంలో 'సాయంసంధ్య' ముగించు కొని వచ్చిన శర్మ, "శివా!" అన్నాడు పెద్దగా.

వెంకన్నా, విధుమౌళీ ఇద్దరూ ఉలిక్కిపడ్డారు. పెద్ద పెద్ద అంగలువేసుకుంటూ కొడుకుని సమీపించిన త్యాగరాజశర్మ 'సంగీత దర్పణం' అనే పుస్తకాన్ని విధుమౌళినుంచి లాక్కుంటూ, "వెంకన్నా! ఇది పాత పుస్తకాలతో కట్టి అటకమీద పడేయ్!" అంటూ వెంకన్న చేతికిచ్చాడు.

వెంటనే కొడుకువేపు తిరిగి, "నాయనా! ఇలా నీవు సంగీత సాధన చేస్తున్న దృశ్యం మరేనాడూ నా కంట పడకూడదు - తెలిసిందా?" కటువుగా అని విధుమౌళి మరేమో చెప్పబోయినా వినకుండా విసురుగా అక్కడనుండి వెళ్ళిపోయాడు.

విధుమౌళికి అర్థమయింది. 'ఇక బ్రహ్మరుద్రాదులు దిగి వచ్చినా తను చెప్పేది ఆయన వినడు. తన విద్యకదే చివరి రోజు' ఇలా ఆలోచిస్తూ ఎంతో రాత్రికిగాని విధుమౌళి నిద్రపోలేకపోయాడు. అలా తండ్రి సంగీత కావ్యాన్ని దాచిన తర్వాత మరెన్నడూ సంగీత సాధన చేస్తూగాని పాడుతూగాని ఆయన కంటపడలేదు విధుమౌళి.

ఈ రోజు....

'తను నేర్పించని పంచరత్న కీర్తన ఎలా నేర్చుకున్నాడు? ఎక్కడ ఇన్ని రోజులు సాధన చేశాడు? ఎందుకు తనకంట పడలేదు? ఏమేమి నేర్చుకొన్నాడింకా?'

బుర్రతొలుస్తున్న ప్రశ్నలకి జవాబు త్యాగరాజశర్మ వద్దలేదు. ఆయన కళ్ళు చింతనిప్పుల్లా అయ్యాయి. కుమారునిపై ఎన్నడూ రానంత కోపం వచ్చింది.

"శివా!" అని అరిచాడు బిగ్గరగా.

ఉలికిపాటుతో కళ్ళు తెరచి ఎదురుగా తండ్రిని చూపి భయాందోళనలు మిళితమైన కంఠంతో, "నాన్నా! మీరా?" అన్నాడు తంబూరాని క్రిందపెడుతూ.

"కాని, మీరు....కళాశాల...." మాటలు పూర్తిచేయలేక తత్తర పాటుగా ఆగాడు విధుమౌళి.

"ఔను! కళాశాలకీరోజు శలవిచ్చారు. అందుకే నేనీవేళ రావడం జరిగింది. నీ బండారం బయటపడింది. చెప్పు-ఎన్నాళ్ళుగా సాగుతుందీ కథ? నేను వద్దన్న పని ఎందుకు చేస్తున్నట్టు?" ఎంతో కోపంగా వున్నా సౌమ్యంగానే వచ్చాయి ఆయన మాటలు.

"మీవద్ద ఇంకా దాచదల్చుకోలేదు నాన్నగారూ! అంతా చెబుతా-వినండి! మీరు సంగీత దర్పణం లాక్కుని అటకమీద పెట్టించిన తర్వాత కొద్ది రోజులకి ఒక అరవం మాష్టారుగారితో పరిచయమైంది. ఆయన కూడా గొప్ప విద్వాంసుడే. రేడియోస్టేషన్‌లో పని చేస్తున్నారు. మీరు చెప్పగా మిగిలిన విద్య వారివద్దనే నేర్చుకున్నాను.

"ఆయన డబ్బు ఏమీ తీసుకోకుండా నాకు విద్య నేర్పారు. ఈ తంబూరా కూడా ఆయన కొనిచ్చారు. ప్రతి రోజూ సాయంకాలం షికారుకి వెళుతున్నట్లు మీతో చెప్పి వారింటికి వెళ్ళేవాడిని.

"మీరులేని సమయంలో ఇంట్లో సాధన చేసేవాణ్ని. ఈరోజు ఈ కృతిని సాధన చేసేందుకే ఒంట్లో బాగోలేదని ఇంట్లో వుండి పోయాను. మీరింత త్వరగా వస్తారనుకోలేదు. అందుకే నిర్భయంగా సాధన చేస్తున్నాను. ఇంతలో మీరు వచ్చారు" అంటూ ముగించి తలవంచుకొన్నాడు విధుమౌళి.

కుమారుని విద్యా తపన చూసి ఆనందం కలిగినా అది మనసులోనే దిగమ్రింగుకొని అడిగాడు.

"నేను కూడదన్న పని ఎందుకు చేశావ్?"

"సంగీతం నా ప్రాణం."

"అంటే నేను కాదన్నమాట!"

"అంతమాట నేను అనలేదు. మీరు నాకు తండ్రి ఐతే, సంగీత విద్య నా తల్లి."

"ఓహో! ఈ మాట మరి ఆనాడే ఎందుకు చెప్పలేదు?"

"ఏనాడు."

"సంగీత దర్పణం తీసి అటకమీద పెట్టిన రోజు!"

"అప్పుడు తండ్రికి భయపడే 12 సంవత్సరాల పిల్లవాణ్ని!"

"ఆహా! ఇప్పుడు కొమ్ములొచ్చాయన్నమాట!"

"కాదు! ఇపుడు పద్దెనిమిది సంవత్సరాల యువకుడిని!"

"తండ్రి నెదిరించడానికి తగిన వయస్సన్న మాట!"

"మీరు పొరబడుతున్నారు. స్థిరమైన అభిప్రాయాలు ఏర్పరచుకుని అవి ఎదుటివారికి చెప్పగలిగే వయస్సని నా భావం..."

"ఐతే ఇకముందు ఇంట్లోనే సంగీత సాధన చేయాలనే అభిప్రాయానికి వచ్చావన్న మాట!"

"ఆ విద్య లేకుండా నేను బ్రతకలేను నాన్నగారూ! పైగా మా గురువుగార్కి కూడా మదరాసుకి ట్రాన్స్‌ఫరైంది. రేపో ఎల్లుండో వెళ్ళిపోతారు" దీనంగా ముఖంపెట్టాడు విధుమౌళి.

"కాని ఆ విద్య దరిదాపుల్లోకి కూడా నీవు వెళ్ళగూడదని నా నిర్ణయం!"

"నాన్నా! మీరేమో నా మూడు ప్రాణాలు, ఆ విద్య నా రెండు ప్రాణాలూను. పంచప్రాణాలు లేకుండా మనిషి బ్రతకటం ఎలా సాధ్యం నాన్నగారూ? మీ ఇద్దరినీ నేను వదలలేను. నాకు కాస్త విషం ఇచ్చి చంపె..."

కొడుకు మాటలు పూర్తి గాకముందే రెండు చెవులు మూసుకుని, "నాయనా! ఆపు!" అన్నాడు త్యాగరాజశర్మ.

"నీ నోటినుండి అశుభం నేను వినకూడదు. కష్టసుఖాలు అనుభవించి వాడినీ, పెద్దవాడినీ ఎందుకు చెబుతున్నానో కొద్దిగా ఆలోచించు. ఆ విద్యవల్ల నేను ఎదుర్కోని కష్టంలేదు. నేను పొందని అవమానం లేదు. నేను పడని మాటలు లేవు. వద్దు తండ్రీ! వద్దు. కలలోనైనా నా పిన్ను సంగీత విద్వాంసుడుగా నేను ఊహించలేను. నాలాగా నీవు అవమానాల పాలుకాకూడదు. నాలాగా నీవు పరులను 'దేహీ!' యని అభ్యపించకూడదు. నాలాగా నీ పిల్లల ఒంటిమీద వాతలు తేలితే దుఃఖించ గూడదు. నాలాగా ఉన్న ఊరు విడచి బ్రతుకు దెరువుకై దేశదేశాలూ పొట్టని చేతబట్టి తిరగకూడదు. నాలాగా పేరు మార్చుకుని, మనసు మార్చుకుని, విద్యని మార్చుకునే అగత్యం నీకు రాకూడదు. ఇంకా-ఇంకా- నాలాగా ఎన్నో నీవు కాగూడదు. అందుకు...అందుకే నీవీ విద్యని మరచి పోవాలి!" ఆవేశంగా అని తను పడిన బాధలన్నీ తలచుకుని కన్నీళ్ళపర్యంత మైనారు త్యాగరాజశర్మ.

ఆయన మాటలు విని కొంచెం సేపాగి, "నాన్నా! మీరీ కష్టా లన్నీ అనుభవించారు. నేను కాదనటం లేదు. కాని అన్నీ ఈ విద్య కారణంగానే వచ్చాయని మీ రనటం పొరపాటు. అమ్మ ఈ విద్య వల్లే పోయిందా? మీ ఆస్తిపాస్తులన్నీ ఈ విద్యవల్లే తరిగిపోయాయా? ఊరూరా పొట్ట చేతబట్టి ఈ విద్యవల్లే తిరిగారా? చెప్పండి.... చెప్పండి నాన్నగారూ!" విధుమౌళి ఆవేశంగా అడిగాడు.

"కాకపోవచ్చు! కాని మీ అమ్మ పోయిన్నాటికన్నా, మన ఆస్తి పాస్తులు హరించిన నాటికన్నా, ఊరూరా పొట్ట చేతబట్టి తిరిగిన దాని కన్నా, నీ ఒంటిపైన తేలిన వాతలు చూసి నేను ఎంతగానో దుఃఖిం చాను. నీకు తెల్సా నాయనా?"

"నిజమే! మీ కొడుక్కి ఒంటిపై వాతలు తేలి ఉండవచ్చును. మీరెన్నో అవమానాలు పొంది ఉండవచ్చును. ఉపవాసాలు పడుకుని ఉండవచ్చు. సంగీత విద్వాంసుడని హేళన గావింపబడవచ్చు. అంత మాత్రంచేత మీరు సంగీత కళామతల్లిని దూషిస్తే అది ఎలుకల కొరకు ఇల్లు చిచ్చు పెట్టుకున్నట్లవుతుంది. ఏ విద్యకైనా పూజ్యావ మానాలు సమానం. ఇపుడు సంస్కృత పండితునిగా చలామణి ఔతున్నారు. మీ ముందు బాగానే మాట్లాడి మీ వెనక 'సంస్కృత పండితుడెహె!' అని ఎందరు హేళన చేయటం లేదు? అలాగని ఈ ఉద్యోగాన్ని మానుకుంటారా?

"అలా హేళనకు గురైనప్పుడల్లా ఒక విద్యని మానుకుని మరో విద్యని నేర్చుకో దలచుకుంటే-అసలు విద్య అనేదే ఉండదు. ఈ ప్రపంచంలో కొందరు మానవుల అవహేళనకు గురికాని విద్య లేనేలేదు. శిల్పిని చూసి రాళ్ళలో గడిపే వాడనీ, చిత్రకారుని చూసి పిచ్చిబొమ్మలు వేస్తాడనీ, నాట్యాచార్యులని చూసి గంతులు వేస్తున్నా డనీ, రచయితని చూసి అసలైన పిచ్చివాడనీ! ప్రజలు తలకో రకమైన బిరుదులు ప్రదానం చేస్తారు. అలాగని వాళ్ళంతా మానుకుని ఉంచే నే దిన్ని అందమైన శిల్పాలూ, కావ్యాలూ, అందమైన నాట్య శాస్త్ర రీతులూ, చక్కని బొమ్మలూ ఉండేవా? చెప్పండి నాన్నగారూ!"

భావోద్రేకంతో ఈమాట లంటున్న కుమారుని వాగ్ధోరణికీ, భావ లహరికీ ఆశ్చర్యపోయిన శర్మ- "నీవు చెప్పేవన్నీ నిజమే

కావచ్చు. కాని నేను అందరినీ నాలాగా నడుచుకోమని చెప్పడం లేదు. నాకున్న అభిప్రాయాలు నావి. నావల్ల ఈ లోకానికి కీడు జరక్కుంటే చాలు-మేలు కలగక్కరలేదు" అన్నాడు.

"అలాగని ఎందు కనుకోవాలి? మీరు పండితులు. గోవు విన్న గానం మీది. నాగులాడిన నాదంమీది. మీరు ఆ విద్యమీద కినుకమాని సాధన చేసి ఉంటే మీరు మరో వాగ్గేయకారు లయ్యేవారేమో! ఎవరు చెప్పగలరు? అలా చూస్తే మీరు మీ విద్యని బంధించుకుని లోకానికి కొంత అపకారమే చేశారని చెప్పొచ్చు. లోకానికే కాదు-సంగీత ప్రపంచానికే, సంగీత కళామతల్లికే ద్రోహం చేస్తున్నారు మీరు. నన్ను ప్రోత్సహించడం మాని ఉత్సాహంగా ఉన్న నన్ను నిరుత్సాహ పరిచి విద్యనే మానేయ...." ఇంకా చెప్పబోయిన కొడుకు మాట లను మధ్యలోనే ఖండించుతూ-

"ఇదంతా ఎందుకు అనవసరపు గొడవ? నీకా విద్య కూడు పెట్టేదా? గుడ్డపెట్టేదా? నా మాట విని నీ మనసు మార్చుకో!" అన్నాడు శర్మ.

విధుమౌళి తగ్గలేదు.

"ఐతే వినండి! ఆ విద్య కూడు పెడితేనే తింటాను. లేకుంటే పస్తులయినా ఉంటాను గాని మరో వృత్తినీ, విద్యనీ శరణు కోరను!" జవాబిచ్చాడు.

"హుఁ! అంతవరకూ వచ్చిందన్న మాట. నేను చెప్పేది కూడా విను. చెప్పిన మాట వినకుండా నీవు అష్టకష్టాలు పడుతుంటే నేను చూడలేను. నా కళ్ళకి దూరంగా పో! పోయే ముందు ఒక్కటి మాత్రం గుర్తుంచుకో! పాడుతున్నప్పుడు ఆనందంగా చప్పట్లుకొట్టే ఈ ప్రజలు స్టేజీ దిగగానే వేలెత్తి చూపుతారు. బహు మతులందజేసే ఈ ప్రజలు బజారుకీడుస్తారు.

"ఒకనాడు నీ పాటకి తాళంవేసే ఈ ప్రజలు మరోనాడు నీ నోటికి తాళం వేయడానికి కూడా వెనుకాడరు. సంగీతం నేర్చు కోవడం దండగ. వినడం నటన. సంగీతం నేర్చుకుని సంగీత విద్వాంసుడిగా బ్రతికే బదులు రెక్కల కష్టం చేసుకుని కూలివాడిగా

బ్రతకడం మేలు. ఈ లోకంలో సంగీతకళకి విలువలేదు....లేదు.... లేదు."

మరింక వినలేక, "ఆపండి!" అంటూ గర్జించుతూ చెవులు మూసుకున్నాడు విధుమౌళి.

"నాన్నగారూ!" ఉద్రేకంగా అవి అంతలోనే ఆవేశం చల్లార్చుకొని, కోపాన్ని దిగమ్రింగుకుని-

"నాన్నగారూ! మీమీది ప్రేమతో మీ మాటకాదన కూడదనుకుని అంతగా మీరు సంగీత విద్యను నేర్చుకోవద్దంటే నా ప్రాణాలైనా విడుస్తాననుకుని అనుకొన్నాను.

"కాని ఇప్పుడు చెబుతాను-వినండి! నేను బ్రతికే ఉంటాను. ఏ విద్యని మీరు దుయ్యబట్టారో అదే విద్య గొప్పదని మీ నోటి నుండే అనిపిస్తాను. ఏ విద్య నాకు కూడు పెట్టదన్నారో అదే విద్యతో సుఖమయ జీవితం గడుపుతాను. ఏ ప్రజలపై కినిసి మీరు సంగీతం మానుకున్నారో అదే ప్రజలముందు మీరు పాడేట్టు చేస్తాను. అంతవరకు మీకు నా ముఖం చూపించను. ఒకవేళ నా ప్రతిన గనక నెరవేరక పోయినట్లయితే చావైనా చస్తానుగాని, అపరాధిలా మీముందు చేతులు కట్టుకొని మాత్రం నిలబడను-శలవు!" అంటూ త్యాగరాజశర్మ బిత్తరపోయి చూస్తుండగా తంబూరనందుకుని ఆ ఇంటి గడప దాటాడు విధుమౌళి. వెంకన్న ఆపాలని ప్రయత్నం చేసినా ఫలితం లేకపోయింది.

* * *

'ఉద్రేకంలో వెళ్ళాడుగాని ఎక్కడికి వెళతాడు- వాడే వస్తాడ'ని మనసుని చిక్కబట్టుకుని రెండు మూడు రోజులు గడిపాడు శర్మ. కాని అతని ఆశ నిరాశేకాగా కొడుకు మాత్రం మళ్ళీ కనిపించలేదు. వెంకన్న హైద్రాబాద్ మొత్తం గాలించి వదపోశాడు. కాని ఫలితం మాత్రం శూన్యం.

ఆలోచించి, ఆలోచించి చివరకు మిణుకు మిణుకుమనే ఆశతో రేడియో స్టేషన్‌కి వెళ్ళాడు. కానీ ఫలితం మామూలే! పేరు తెలియని ఆ విద్వాంసుని గూర్చి ఎవరూ చెప్పలేకపోయారు. హైద్రాబాద్

నుండి మద్రాసుకి ట్రాన్సఫరైన వ్యక్తి గురించి వాకబుచేయగా మద్రాసులోని ఆయన ఇంటి వివరాలు తమకు తెలియదన్నారు.

మద్రాసుపోయి ఒక రోజల్లా రేడియోస్టేషన్‌లో పడగాపులు గాపి తెల్సుకున్నదేమంటే హైద్రాబాద్ నుండి మద్రాసుకి ట్రాన్సఫరై వచ్చిన రామశాస్త్రిగారు ఒంట్లో బాగోలేక హాస్పిటల్లో వున్నట్టు తెలిసింది. రెండు రోజులు శ్రమపడి వెంకన్నా తనూ వెతకగా, వెతకగా ఓ హాస్పిటల్లో కనిపించిన రామశాస్త్రిగారు-తనకి ఒక కూతురు తప్ప ఎవరూలేరనీ, విధుమౌళిశాస్త్రి పేరు కూడా తను వినలేదని చెప్పాడు. చేసేది లేక విధివంచితుడైన త్యాగరాజశర్మ వెంకన్నతోసహా హైద్రాబాద్‌కి తిరుగు ప్రయాణమయ్యాడు.

"విధుమౌళిశాస్త్రి కళాశాలకి రావడం లేదు-ఎందుకండీ? ఒక వేళ నేను విన్నది నిజమే కాదు గదా?" అడిగాడు విధుమౌళి ఇంటి నుండి వెళ్ళిపోయిన ఓనెలరోజులకి ఓనాడు గోపాలరావు శర్మని.

"ఏం విన్నారు మీరు?"

"మీతో ఏ విషయంలోనో పోట్లాడి యింటి నుండి వెళ్ళిపోయాడని ఎవరో అనగా విన్నాను."

"ఔనండీ! విద్య గురించి ఏర్పడిన పరస్పర విరుద్ధమైన భావాలు మమ్మల్ని విడదీశాయి."

అంతే చెప్పి అక్కడ నుండి వెళ్ళిపోయాడు త్యాగరాజశర్మ.

ఆ తర్వాతెప్పుడూ గోపాలరావు విధుమౌళి గురించి అడగలేదు. అడిగినా త్యాగరాజశర్మ చెప్పడని అర్థం చేసుకున్నాడు.

త్యాగరాజశర్మ విధుమౌళిని పుట్టినరోజుకి కొత్త బట్టలు కుట్టించి, తీపి పదార్థాలు చేయించి, అవి అతని స్నేహితులకు పంచుకోమనే వాడు!

కొడుకు యింటి నుండి వెళ్ళిపోయిన తరువాత వచ్చిన పుట్టినరోజుకి పిచ్చెత్తినట్లుగా ఇల్లంతా తిరిగాడు. వెంకన్నని అడిగిందే అడిగాడు, చెప్పిందే చెప్పాడు. ఆయన పరిస్థితి చూచి వెంకన్న లోలోపలే కుమిలి కుమిలి ఏడ్చాడు. సాయంత్రం వరకూ అలాగే పిచ్చెత్తినట్లు ప్రవర్తించి సాయంత్రం విధుమౌళి తోటి పిల్లలందరినీ యింటికి తీసుకొచ్చి బజారు నుండి స్వీట్లు తెప్పించి అందరికీ

పంచాడు. అది మొదలు కొడుకు దగ్గర లేకున్నా పుట్టిన రోజుకి మాత్రం స్వీట్లు పంచుతూనే ఉన్నాడు.

* * *

కాలగర్భంలో పది సంవత్సరాలు దొర్లిపోయాయి. ఎంతగా వెదికినా, పేపర్లలో ప్రకటించినా, రేడియోల్లో చెప్పించినా, ఊరూరా గాలించినా విధుమౌళి జాడమట్టుకు తెలియలేదు. విధుమౌళి వెళ్ళి పోయిన ఏడవ పుట్టిన రోజది. ఆ రోజెందుకో త్యాగరాజశర్మ మనసు అంతా కుమారుడి చుట్టూ తిరుగుతున్నది. కళాశాల నుండి పిల్లల్ని పిలవాలంటే ఆ రోజు ఆదివారం గనుక శలవు. పోనీ యిళ్ళకు వెళ్ళి పిలవాలంటే ఎవ్వరి ఇళ్ళూ ఆయనకు తెలియవు. ఇన్ని సంవత్సరాలూ తన కొడుకు మనసు మార్చుకొని రాకపోతాడా అని ఎదురు చూశాడు. కాని ఆ రోజు మనసు పదే పదే విధుమౌళిని గుర్తుకి తెస్తున్నది. ఇక మనోక్షోభని భరించలేక పోయాడు. 'ఉన్న ఒక్క కొడుకూ దూరమయ్యాక ఇక తనెవరికోరకు బ్రతకాలి? ఈ ఉద్యోగ మెందుకు? ఈ డబ్బు సంపాదన ఎందుకు?'

సుదీర్ఘమయిన ఆలోచనలో రెండుగంటలు గడిచిన తరువాత చుట్టూ చూశాడు. ఎందరో పిల్లలు కేరింతలు కొడుతూ ఆడుకుంటున్నారు.

త్యాగరాజశర్మ ఉంటున్న యింటికి కొద్ది దూరంలో ఒక మైదానముంది. ఆ మైదానంలో పిల్లలంతా సాయంకాలం వేళ కాగానే ఉత్సాహంగా ఆడుకొంటూ ఉంటారు. చిన్న పిల్లల్నేగాక ఫుట్ బాల్, కబడ్డీలాంటి ఆటలు ఆడే యువకులవి కూడా సాయంకాలం సమయంలో మైదానంలో చూడవచ్చును.

అదే మైదానానికి చివర ఒక పాడుపడిన బావి ఉంది. అది ఎన్ని వందల సంవత్సరాల క్రితం త్రవ్వబడిందో గాని బావిపై కట్టబడిన గోడలన్నీ కూలిపోయి చుట్టుప్రక్కల ఉన్న మరికొంత స్థలాన్ని గూడా తనలో కల్పుకుని మరింత పెద్దగా తయారయ్యిందది.

త్యాగరాజశర్మకి కొడుకు గుర్తుకు వచ్చినప్పుడల్లా అలా మైదానంలోకి వచ్చి కూర్చుని చిన్న పిల్లల ఆటలూ, కేరింతలూ, పెద్దవాళ్ళ పోటీ ఆటలూ చూసి కొంచెం మనసు స్థిమిత పడగానే

యింటికి తిరిగి వస్తుంటాడు. అలాగే ఈ రోజూ వచ్చాడు. కాని కొడుకు రాకని గురించి నిరాశ చెందిన ఆయన ఏదో స్థిర నిర్ణయానికి వచ్చినట్టు మెల్లిగా లేచి ఆ పాడుబడిన బావికేసి నడిచాడు. బావి దగ్గరగా వెళ్ళి రెండు చేతులెత్తి భగవంతుడికి నమస్కరించి అందులో దూకాలని వంగబోయాడు. అంతలో ఎవరో ధోవతిని పట్టుకుని వెనక్కి లాగుతున్నట్టయి వెనుదిరిగి చూశాడు. ఆయన వెనుక....

మాసిపోయిన గౌనుతో, తైలసంస్కారంలేని జుట్టుతో, పీక్కుపోయిన కళ్ళతో వున్నా- పచ్చని శరీరచ్ఛాయతో, అందమైన కను ముక్కు తీరుతో, చిన్ని నోరుతో మట్టిలోని మాణిక్యంలా మరుగున పడిన అందంతో విల్చుని ఉందో నాలుగేళ్ళ పాప. త్యాగరాజశర్మ వెనక్కి తిరిగినా ఆ పాప ఆయన పంచెను మాత్రం విడవలేదు. పైగా బిగ్గరగా రెండు చేతులతో పట్టుకుని చిలిపిగా ఆయనను చూపి నవ్వింది. ఆ పాపను చూపి ఆశ్చర్యంగా-

"పాపా! నువ్వు ఇక్కడికెందుకొచ్చావమ్మా? వెళ్ళు-వెళ్ళు!" అన్నాడు శర్మ.

"వస్తే ఏం?"

"అమ్మో! ఇది పెద్ద బావితెల్సా? ఇందులో పడిపోతావు."

"ఐతే నువ్వెందు కొచ్చావు?"

"నేనా.... నేనూ.... నేను దేవుడి దగ్గరకు వెళ్తున్నానమ్మా!"

"ఇందులో పడితే దేవుడి దగ్గరకు వెళ్తారా?"

"ఔనమ్మా!"

"అలాగా! ఐతే నేను దేవుడి దగ్గరకు వెళ్ళాలి. అందులో పడతాను" వెళ్ళబోయింది పాప.

శర్మ కంగారుగా ఆ పాపని అడ్డుకుని వెనక్కి తీసుకువచ్చి, "వద్దమ్మా, వద్దు! నీవు దేవుడిదగ్గరకు రాకూడదు."

"ఏం? మరి నువ్వు వెళ్తున్నావుగా?"

"నేను నాకు ఎవరూలేరు గనుక వెళ్తున్నాను" అన్నాడు శర్మ.

"అలా ఐతే నాకూ ఎవరూ లేరుగా!" పాప మాటలకి చాలా ఆశ్చర్యపోయి, "అమ్మా, నాన్నా, ఎవరూ లేరా నీకు పాపా?" ప్రశ్నించాడు.

"అమ్మంటే, దాదమ్మా... పెద్దమ్మా....చిన్నమ్మా?........"
పాప ప్రశ్నకి ఏంజవాబు ఇయ్యాలో తెలియక, "సరే ఐతే పాపా! నీవు ఇన్నిరోజులు ఎక్కడ ఉన్నావో చెప్పు!" అనడిగాడు లాలింపుగా.

పాప అందమైన కళ్ళు గుండ్రంగా తిప్పి క్షణం యోచించి,

"ఇన్ని రోజులూ నేను ఎక్కడ ఉన్నానంటే చిన్ని చిన్ని చెల్లాయిలూ, నా అంత పాపలూ, అక్కయ్యాలూ ఉంటారు చూడు-అక్కడ."

పాప మాటలు మొదట్లో ఓందర వందరగా అనిపించినా హఠాత్తుగా అయన స్మృతి పథంలో అనాథ శరణాలయం మెరిపింది. 'ఈ పాప అనాథ శరణాలయంనుండి వచ్చిందా!' అనుకుని,

"మరి పాపా, ఇక్కడి కెందుకొచ్చావ్?" అడిగాడు ఆత్రంగా.

"ఎక్కడనుండి?" ఎదురు ప్రశ్నించింది పాప!

"అదే, చిన్న చిన్న పాపాయిలుండే చోటునుండి."

"ఓహో! అక్కడినుండా? నేను స్కూలుకి వెళ్తుంటే మీసాల మామయ్య చాక్లెట్లిచ్చి నన్ను అక్కడనుండి తీసుకు వచ్చాడుగా!" అంది పాప.

'పాపం! ఈపిల్లని ఎవరో దొంగ వెధవ అనాథ శరణాలయం నుండి చాక్లెట్ల ఆశ చూపి ఈ ఊరికి తెచ్చినట్టున్నారు.' అనుకున్నాడు మనసులో శర్మ.

"సరే ఐతే, మరి మీసాల మామయ్య ఏడీ?"

ఈ మాట వినగానే పాప ముఖమంతా చిట్లిస్తూ, "ఛీ- ఛీ- ఆ మామయ్య మంచివాడు కాదు" అంది.

"ఎందుకని?"

"మరేమో ఆ మామయ్య వాళ్ళ యింట్లో చాలామంది అక్కయ్య లున్నారు. వాళ్ళందరినీ మామయ్య ఎప్పుడూ కొట్టి చంపుతుంటాడు. అంతే కాదు. రాత్రి కాగానే ఆ మామయ్య చాలామంది మామయ్యలని తీసుకు వచ్చేవాడు. మామయ్యా-వాళ్ళూ కిల్సి వాసన మందు లేదూ-అది త్రాగేవాళ్ళు!" అని కొద్దిసేపు ఆగింది పాప.

తరువాత మళ్ళీ మొదలు పెడుతూ- "ఆ తరువాత వచ్చిన మామయ్య లందరూ ఒక్కో అక్కయ్యని జుట్టు పట్టుకుని బరబరా లాక్కుపోయేవారు. అక్కయ్య లంతా పెద్దగా అరుస్తూ ఏడిచేవాళ్ళు. నాకు కూడా ఏడుపొచ్చేది. కాని నేను ఏడిస్తే మామయ్య నన్నుకూడా కొట్టేవాడు. అందుకని మీసాల మామయ్య నిద్రపోతుండగా చూసి బయిటికి పరుగెత్తుకుంటూ వచ్చేశాను. మామయ్య వాళ్ళ ఇంటిదగ్గర బస్సు లేదూ, అదెక్కి కూర్చున్నాను. బస్సు అబ్బాయి నన్ను ఇక్కడ దింపాడు. ప్రొద్దుటినుండి చాలా తిరిగాను, కాళ్ళు నొప్పిగా ఉన్నాయి." పాప చెప్పడం ముగించింది.

ఆ పాప ఒక వేశ్యా గృహానికి బలికానందుకు భగవంతువికి కృతజ్ఞతలు చెప్పుకుంటూ,

"మరి నన్నెందుకు అపావు పాపా?" అనడిగాడు త్యాగరాజ శర్మ.

"నువ్వు అక్కడ కూర్చున్నంతసేపూ నిన్ను పలకరించాలని చాలాసార్లు నీ దగ్గరకు వచ్చాను. కాని నువ్వు నన్ను చూడనేలేదు. తరవాత నువ్వు లేవగానే నీతోపాటు నేనూ లేచి వచ్చాను" అంది.

"అలాగామ్మా!"

ఆ పిల్లను ఎత్తుకున్నాడు.

"మరి నీకెవరూ లేరా?"

"లేరమ్మా!"

ఐతే ఇద్దరం ఇందులో దూకి దేవుడి దగ్గరకు పోదామా?"

"వద్దు తల్లీ! వద్దు!" అని పైకి అని, 'కర్తవ్య శూన్యుడనైన నాకు దేవుడు ఒక కర్తవ్యం బోధించాడు.' అని మనసులో అనుకున్నాడు.

"పదమ్మా! మా ఇంటికి వెళదాం!" అని ఆ పిల్లని తీసుకొని ఇంటికి వచ్చాడు. ఆ పాపపేరు అడిగితే 'శాంతి' అని చెప్పింది. 'అశాంతి నిండిన నా జీవితానికి నీవు నిజంగా శాంతేనమ్మా!' అనుకుని ఆ పిల్లని చేరదీశాడు.

'చక్కగా పెంచి విద్యాబుద్ధులు చెప్పించాలి. తరువాత ఓ ఇంటిదాన్ని చేయాలి. ఈ పని నెరవేర్చమనే భగవంతుడు ఆ పిల్ల

రూపంలో తన ప్రాణాలు కాపాడాడు.' అనుకుని వెంకన్నకి ఆ పాపని చూపిస్తూ, "వెంకన్నా! ఈ పాప ఈ రోజు నా ప్రాణాలు కాపాడింది. దిక్కులేని ఈమెని విధుమౌళిని ఎలా చూశామో అలా చూడాలి-మనిద్దరం!" అంటూ అంతవరకు జరిగిందంతా చెప్పాడు.

వెంకన్న అంతా విని, "బాబుగారూ! ఎంతవిచిత్రం! ఏడనో పుట్టింది. అనాథ శరణాలయంలో పెరిగింది. సానికొంప నుండి తప్పించుకుంది. మీ ప్రాణాలు తీసుకోకుండా కాపాడి తన బతుకే బంగారుమయం చేసుకుంది" అన్నాడు.

"ఔను వెంకన్నా! నా జీవితానికో అర్థం కల్పించింది శాంతి!" అంటూ ముద్దుపెట్టుకున్నాడు. ఆ పాపచేత 'తాతా!' అని పిలిపించుకుని ఆ శాంతితో తన అశాంతిని మరచిపో గల్గుతున్నాడు-కొంతవరకైనా త్యాగరాజశర్మ.

* * *

శాంతి వచ్చిన తరువాత త్యాగరాజశర్మ మళ్ళీ యధా ప్రకారంగా పనులు చేసుకోవడమూ, పరధ్యానంగా మాట్లాడక పోవడమూ చూసి వెంకన్న సంతోషించాడు. 'పోనీలే! ఇలానైనా తన బాధని మరచిపోగల్గుతున్నారు బాబుగారు!' అనుకున్నాడు మనసులో.

త్యాగరాజశర్మ ఎం. ఏ. పరీక్ష పాసైనాడు. గోపాలరావు చాలా ఆనందించాడు. ఎంతో మెచ్చుకున్నాడు. అదంతా తేలిగ్గా తీసేస్తూ, "నా గొప్ప తన మేముంది, గోపాలరావుగారూ! ఇదంతా మీ చలవే!" అన్నాడు కృతజ్ఞతగా.

అటు తరువాత పి. హెచ్. డి. పుచ్చుకున్నాడు.

గోపాలరావు ఏమాత్రం ఈర్ష్య పడలేదు. పైగా ఆ బిరుదు తనకే వచ్చినంతగా సంతోషపడ్డాడు.

"మీది అమోఘమైన మేధస్సు. నేను ఎం. ఏ. పాసైనా, డాక్టరు బిరుదు కొట్టేయాలని అనుకున్నా, ప్రతివాళ్ళకీ అది జాతనైతే ఇక చదువు విలువ ఏముంది?" అనేవాడు.

త్యాగరాజశర్మ మాత్రం-"నేను పుస్తకాలు వ్రాసినా, బిరుదులు పొందినా అదంతా మీ ప్రోత్సాహ బలమే!" అనేవాడు.

'తన పాఠశాల కళాశాలగా మారడానికీ, కళాశాలకి మంచిపేరు

రావడానికీ ఎక్కువమంది తమ కళాశాలనుండి ఉత్తీర్ణులు కావడానికీ- అసలీ అదృష్టాని కంతకూ శర్మగారి పాండిత్యమూ, వారు కాలు పెట్టిన వేళా విశేషమూ ఈ రెండే కారణాలు' అనుకునేవారు గోపాలరావు.

*　*　*　*

కళాశాలలో త్యాగరాజశర్మ తోటి ఉపాధ్యాయులతో గాని, విద్యార్థులతోగాని ఎప్పుడూ అవసరానికి మించి మాట్లాడే వాడుకాడు. పలకరించిన దానికి మాత్రం సమాధానం చెప్పేవాడు. అదే ఆయనకి ఎక్కువమంది స్నేహితులు లేకపోవడానికి కారణం. క్లాసు తీసుకోకుండా ఉన్న సమయంలో ఏదో పుస్తకం తిరగేస్తూ కూర్చుంటాడు. అలాగే కూర్చున్నాడో రోజు. అంతలో ఆ విశ్రాంతి గదిలోనికి వచ్చిన విశ్వం ఆయనను పలకరించాడు-

"ఏ పుస్తకం చదువుతున్నారు శర్మగారూ!" అంటూ.

"ఇదా- ఇది రాఘవ పాండవీయము. ఎన్నిసార్లు చదివినా మళ్ళీ చదివినప్పుడు కొత్త అర్థం స్ఫురిస్తుంది" జవాబిచ్చాడు శర్మ.

"ఔనండి! మీకు ఒకసారి చదవగానే వచ్చేస్తుంది. ఐనా పదే పదే చదువుతారు. మాకు ఎన్నిసార్లు చదివినా గుర్తుండదు. కాని ఒకసారికన్నా మేము చదువలేము. అందుకే మీరు డాక్టరేటు పుచ్చుకున్నారు. మేము జీతంరాళ్ళు మాత్రం పుచ్చుకోగల్గుతున్నాం" అన్నాడు నవ్వుతూ

ఔనూ కాదూ అని ఏమీ అనకుండా చిరునవ్వు నవ్వాడు శర్మ.

కొద్ది క్షణాలాగి, "ఔను శర్మగారూ! ఈ కాలేజీకి వెలుతురు మీరు. మీవల్లే ఇదింతగా ప్రఖ్యాతిలోకి వచ్చింది. అలాంటప్పుడు పెత్తనమంతా ఆ గోపాలరావుగారి మీద ఎందుకు? బిరుదు పొంది కూడా ఈ గోపాలరావు క్రింద పనిచేయటం దేనికి? కుత్రంగా మీరు మరొక కళాశాల తెరవకూడదూ! అపుడు మీకు మంచిపేరూ, డబ్బూ వస్తాయికదా?" అన్నాడు గొంతు కాస్త తగ్గించి. అతని మాటలకు త్యాగరాజశర్మ ఎంతో ఉద్రేకపడిపోయాడు. ఐనా దాన్ని కనిపించనీయకుండా నిదానంగా అన్నాడు-

"మీ సలహాకి కృతజ్ఞుడిని విశ్వంగారూ! కాని నాకు అటువంటి

ఆలోచన ఇదివరకు రాలేదూ, ఇకముందు రాబోదు. చూడండీ! నే నీరోజు ఈ స్థితిలో ఉన్నానంటే దానికి కారణం ఎవరో తెల్సా? నీడనిచ్చే వృక్షాలను నరుక్కునే వాళ్ళుంటారా! నాకాయన అన్నదాత. ఆయన పేసరు పెట్టాలని చూస్తే భగవంతుడు నన్ను క్షమించడు. ఐనా నాకున్న పదిమంది సంతానం బ్రతకలేక పోతారని నేను మరో కళాశాల తెరిచేదా? ఆయన్ని కాదన్న కీర్తి ప్రతిష్టలుగాని, ఆయనకి వ్యతిరేకంగా సంపాదించుకున్న డబ్బుగాని నాకవసరం లేదు. అమృత హస్తంతో ఆయనిచ్చే జీతపురాళ్ళే నాకు చాలు. అంతకన్నా అత్యాశ నాకులేదు."

ఈ మాటల్ని త్యాగరాజశర్మ వెనుకనుండి ఎప్పుడు వచ్చి వింటున్నాడోగాని త్యాగరాజశర్మ మాట్లాడటం ఆపేయగానే-"శర్మ గారూ!" అంటూ ఆయన చేతులు పట్టుకున్నాడు-ముందుకు వచ్చిన గోపాలరావు. శర్మ తడబాటుగా___

"నేను.... నేను....నాకా ఉద్దేశ్యం లేదండీ!" అన్నాడు.

"నేను మీ మాటలన్నీ విన్నాను శర్మగారూ! ఈరోజు నేను భగవంతుడికి మనఃపూర్వకంగా కృతజ్ఞతలు తెల్పుకుంటున్నాను. ఎందుకో తెల్సా- నాకు పోటీగా మీరు మరో కళాశాల తెరవనందు కనుకునేరు? కాదు, కాదు-నేను సహాయం చేసింది ఒక ఉత్తముడికే అని నాకు తెలుసు.

"కాని అది నిజమే అని భగవంతుడు నాకెరుక పరచినందుకు, మిమ్మల్ని అంచనా వేయటంలో పొరపాటుపడలేదని చెప్పేందుకు ప్రత్యక్షసాక్ష్యం నా చెవులే ఐనందుకు, అందుకే ...అందుకే నేను భగవంతునికి కృతజ్ఞతలు చెప్పుకుంటున్నాను" అని కొంచెమాగి విశ్వంవేపు తిరిగి, "విశ్వంగారూ! అందరూ మీలాంటి వాళ్ళేనని సలహాలివ్వడం మానుకోండికనైనా!" అని అక్కడినుండి నిష్క్రమించాడు. తెల్లబోయి చూసాడు విశ్వం.

గోపాలరావుగారి మంచితనం మూలంగా, శర్మగారు త్వరలోనే, ఓఇల్లుకూడా కొనుక్కో గలిగారు.

*　　　*　　　*

"తాతయ్యా! ఎవరొచ్చారో చూడు!" శాంతి తట్టి లేపడంతో

కళ్ళు మూసుకొని గతాన్ని నెమరు వేసుకుంటున్న త్యాగరాజశర్మ ఎదురుగా ప్రిన్సిపాల్ గోపాలరావుని చూపి ఆశ్చర్య పోయాడు.

"మీరూ....వచ్చారా?" అని శర్మ,

"మీ ఒంట్లో ఎలా ఉంది?" అని ఇద్దరూ ఒకేసారి ఒకరి నొకరు ప్రశ్నించుకొన్నారు.

తమ మాటలకి నవ్వొచ్చి ఫకాలున నవ్వేశారొకేసారి.

"బావుంది-బావుంది. స్నేహానికి చక్కగా సరిపోయారిద్దరూ!" చిన్నగా నవ్వుతూ అంది శాంతి.

"ఆఁ శర్మగారూ! మీతో ఓ విషయం చెప్పాలని వచ్చాను." అన్నాడు.

"చెప్పండి!"

"ఇంకా పదిరోజుల్లో వినాయక చవితి ఉందికదా. ఈ సారి ఏదైనా కొత్త ప్రోగ్రాం ఏర్పాటు చేయమని మన విద్యార్థులంతా కోరారు. వాళ్ళనే సూచించమన్నాను. అందుకు వాళ్ళంతా ఒకే నిర్ణయం మీద చెప్పిన మాట ఏమంటే ఈ సారి మంచి విద్వాంసుడిని పిలిపించి సంగీత కచ్చేరీలు ఏర్పాటు చేయమని. దేవుడీయదలచిందే భక్తుడు కోరబోయేడన్నట్లు నా ఉద్దేశ్యంగూడా అదే. మీకు తెలుసునో, తెలియదో గాని నాకు సంగీతమంటే చాలా పిచ్చి. ఎన్నాళ్ళనుండో నేను ఏర్పాటు చేయాలనుకున్న గాన సభకి విద్యార్థుల ప్రోత్సాహం కూడా లభించడం నా అదృష్టం. మరి మీ యిష్టంకూడా చెప్పండి!"

సంగీతసభ పేరు వినగానే ఉలికిపడి అంతలోనే తమాయించుకుని, "అలాగే, అలాగే! మీ ఇష్టం-నేను మాత్రం ఏమంటాను? మంచిది-అలాగే చేయండి!" ఒకదానికొకటి పొంతన లేని మాటలతో ముగించారు శర్మ.

"మీరు అలాగే అని తప్పుకుంటే కాదు. అందుకు అర్హులైన వారిని మీరే నిర్ణయించాలి."

"నేనా? నాకేం తెలుసండీ! సంగీతంలో స్వరాలెన్నోకూడా తెలియదు నాకు. నేనేం నిర్ణయించ గలను?"

"అన్నింటికి తప్పుకుంటే ఎలాగండీ! సరే మన విద్యార్థుల

నిర్ణయమూ, నా నిర్ణయమూ వినండి. ఇటీవలే రేడియో స్టేషనులో అపాయింటయ్యాడే త్యాగరాజశర్మగారూ-వారినీ, సంగీత చక్రవర్తి బిరుదుగాంచిన విష్ణుమూర్తిగారినీ పిలవాలని తీర్మానించుకున్నాం."

త్యాగరాజశర్మ-సంగీతం-గానసభ-ఈ మాటలు వింటుంటే త్యాగరాజశర్మ మైకం పట్టినవాడిలా అయ్యాడు.

'ఒకవేళ తన కుమారుడే ప్రయోజకుడై అన్నమాట నిలుపుకునేందుకై తన పేరుతో వ్యవహరిస్తున్నాడా?' అన్న అనుమానం ఆయన్ని పట్టి పీడిస్తోంది. 'రేడియో స్టేషనుకి వెళ్ళి కనుక్కుంటే? కాని మరో పదిరోజులలో ఆ త్యాగరాజశర్మని ప్రత్యక్షంగా చూడవచ్చును గదా? ఎందుకు తొందర పడాలి?' అన్న ఆలోచనలో ఉన్న శర్మ-

"ఏమంటారూ?" అన్న గోపాలరావు మాటలతో ఆలోచన కట్టిపెట్టి, "మంచిది! అలాగే చేయండి. మీ రెప్పుడూ విలువైన నిర్ణయాలే తీసుకుంటారని నాకు తెలుసు!" అంటూ తప్పుకున్నాడు.

*   *   *   *

త్యాగరాజశర్మ సంస్కృత కళాశాలకు బయల్దేరబోతుండగా వాకిటముందు ఓ రిక్షా వచ్చి ఆగింది. రిక్షాలోంచి ఓ నలభై ఏళ్ళ స్త్రీ దిగి, రిక్షావాడికి డబ్బులిచ్చి పంపేసి చేతిలో సూట్‌కేస్‌తోపాటు శర్మగారింట్లోకి అడుగుపెట్టింది.

శర్మగారు ఆశ్చర్యపోయారు. ఆయన ఆశ్చర్యం నుండి తేరుకొనేలోగానే ఆ స్త్రీ త్యాగరాజశర్మ పాదాలకు నమస్కరించి, "నేను మీ కోడల్ని మామయ్యగారూ!" అంది.

శర్మగార్కి అయోమయంగా వుంది. వచ్చిన స్త్రీని పరీక్షగా చూశాడు. ఆమె ముఖాన బొట్టులేదు. వైధవ్యం లక్షణాలు కొట్టొచ్చినట్టు కనిపిస్తున్నాయి.

'అయితే తన విధుమౌళి?' ఆ తర్వాత ఆలోచించలేక పోయాడు. "ఏమిటమ్మా నీవు మాట్లాడేది?" అన్నారు మెల్లగా.

"అన్ని విషయాలు తర్వాత చెప్తాను మామగారూ!" అంటూ చొరవగా ఆమె సూట్‌కేస్‌తో పాటు లోనికెళ్ళింది.

త్యాగరాజశర్మ, శాంతిని పిలిచి వచ్చిన స్త్రీకి కావలపిన ఏర్పాట్లను చూడమన్నాడు.

ఓ అరగంటలో ఆ స్త్రీ కాలకృత్యాలు ముగించుకొని త్యాగ రాజశర్మ ఎదుటికి వచ్చింది.

"మామయ్యగారూ! నా పేరు చంద్ర. మా నాన్నగారు సంగీత విద్వాంసులు. మా నాన్నగారు ఇక్కడ రేడియో స్టేషన్‌లో పని చేసేటప్పుడు, మీ కుమారుడు మా ఇంటికి సంగీతం నేర్చుకు నేందుకు వచ్చేవారు. మా నాన్నగార్కి ఇక్కడినుంచి మద్రాసుకు ట్రాన్సఫర్ అయ్యింది. అప్పట్లో మీతో గొడవపడి ఆయన మా ఇంటికి వచ్చారు. మా నాన్నగారితో అన్ని విషయాలు చెప్పారు.

"చివరకు, 'మాష్టారూ! చేసిన శపథం నెరవేరేవరకు ఇక ఆ ఇంటి గడప త్రొక్కను. శలవిప్పించండి! ఎక్కడికైనా వెళతాను' అన్నారు. అందుకు బాబాయి—

"నువ్వెక్కడికీ వెళ్ళక్కర్లేదు. నాతో మద్రాసు రమ్మ" న్నారు. మీరు గనక తన కొరకు వెతుక్కొంటూ వస్తే తెలియదని చెప్పే షరతుతో ఆయన మాతో మద్రాసు వచ్చారు.

"అక్కడికి వెళ్ళిన కొద్ది రోజులకే నీళ్ళ మార్పిడివలన బాబాయికి జ్వరంవస్తే ఆయన బలవంతంగా హాస్పిటల్లో చేర్పించారు. అప్పుడే మీరొచ్చారు. బాబాయి తెలియదని తప్పుకున్నారు. మీరు వచ్చి వెళ్ళిన తర్వాత బాబాయికి బజారునుండి పళ్ళు కొనుక్కొని వస్తున్న ఆయనా, నేనూ నవ్వుతూ రోడ్డుమీద నడుస్తున్నాం. బాబాయి స్నేహితులెవరో చూసి, 'మీ అమ్మాయితో ఆ అబ్బాయి వికవిక పకపక లేంటి?"అని అడిగారట.

"హాస్పిటల్‌నుండి ఇంటికి వచ్చాక ఆయన్నడిగారు బాబాయి- 'మా అమ్మాయిని పెళ్ళిచేసుకోవడం ఇష్టమేనా?' అని. ఆయన అంగీకారంతో పద్దెనిమిది సం॥రాల ఆయనకి, పదహారు సం॥రాల నాకూ వివాహం జరిగింది. వివాహానికి మిమ్మల్ని పిలుస్తానని బాబాయి ఎంత చెప్పినా ఆయన వినలేదు. మా దాంపత్య జీవిత ఫలితంగా వివాహమైన రెండు సం॥లకే మీలాగే తన ఇరవయ్యవఏట తండ్రి అయ్యారు.

మీ కళ్ళకి దూరంగా ఉన్నా ఆయన ఎప్పటికప్పుడు మీ విషయాలు తెలుసుకుంటూనే వుండేవారు.

"బాబాయి ఇంట్లో ఉంటున్నా ఆయన ఏనాడూ బాబాయి డబ్బు వాడుకుని ఎరగడు. మద్రాసు వెళ్ళిన తర్వాత ఆయన ట్యూషన్స్ కుదుర్చుకొని ఆ డబ్బుని బాబాయి చేతిలో పెట్టేవారు.

"బాబాయి ఆ డబ్బుని తిరస్కరిస్తే, 'నా భార్యతోసహా నేను మీ ఇంటినుండి వెళ్ళిపోవాలని మీ ఉద్దేశ్యమయితే తీసుకోవద్దు!' అంటూ ముంగాళ్ళకు బంధాలు వేసేవారు.

మరి కొన్ని నెలలకే ఆయన ఏదో మ్యూజిక్ కాలేజీలో లెక్చరర్‌గా చేరారు. ఆనాడైనా మిమ్మల్ని పిలిపించమని బాబాయి చెబితే, 'నా ఈ స్థితికాదు ఆయన చూడవలసింది- నా శపథం నెరవేరే రోజు దగ్గరలోనే ఉంద'ంటూ వారించారు.

"అటు తర్వాత విధి నా జీవితంతో. ఆటలాడుకుంది. ఓరోజు ఆయన కడుపునొప్పితో మెలికలు తిరిగిపోయారు. హాస్పిటల్‌కి పోదామంటే కడుపునొప్పికి హాస్పిటల్ దేనికని బాబాయీ, నేను ఎంత చెప్పినా విన్లేదు. ఆ తెల్లవారి నొప్పికి తాళలేక మూర్ఛపోతే భయపడిన బాబాయి డాక్టర్ని పిలుచుకు వచ్చారు. డాక్టర్ ఆయన్ని చూపి పెదవి విరిచాడు.

"'ఇది ఎపెండిసైటిస్! 24 గంటలలోగా ఆపరేషన్ చేయాలి. ఇప్పుడు టైం దాటిపోయింది. ఇంక ఆపరేషన్ చేసినా బ్రతక'రని నిష్కర్షగా చెప్పాడు. ఏవేవో ఇంజక్షన్లు ఇచ్చి ఆయునకు మెలకువ వచ్చేటట్టు మాత్రం చేసాడు. కళ్ళు తెరచిన ఆయన తన స్థితి తెలుసుకున్నారేమో నన్నూ, బాబుని దగ్గర కూర్చోబెట్టుకుని—

"'చంద్రా! నిన్ను అన్యాయం చేసిపోతున్నాను. నేను పోయిన తర్వాత నువ్వు మా నాన్న ఇంటికి వెళితే ఆయన నిన్ను ఆదరిస్తారు. కాని నువ్వు అక్కడకు వెళ్ళొద్దు. మీ బాబాయి అండదండలతో మన బాబును పెంచి పెద్దచేసి వాడికి నా ప్రతిన తెల్పి వాడిద్వారా నా శపథం సఫలమయ్యేట్టు చూడు. ఒకవేళ ఆర్థికంగా నీవంత చేయలేకపోయినా, బాబు నీ మాట వినకపోయినా. చంద్రా! నేచెప్పేది జాగ్రత్తగా విను.

"'బాబు గనక నా ప్రతిన నెరవేర్చేవాడు కాలేకపోతే మీరిదరూ

చెరికాస్తా విషం పుచ్చుకొని నా దగ్గరకి వచ్చేయండి! అంతేగాని నాన్న దగ్గరకు పోయి ఆయన సిద్ధాంతమే నిజమని ఋజువు చెయ్యొద్దు. కాని ఆయన బాగోగులు చాటుగా తెల్సుకుంటూ వుండు!' అంటూ కన్ను మూసారు.

"మా దుఃఖానికంతులేకపోయింది. 'పాతికేళ్ళకే పెద్దదానివై పోయావమ్మా!' అంటూ బాబాయి ఎంతగానో నన్ను చూపి విలపించాడు. మళ్ళీ పెళ్ళి చేస్తానన్నాడు. కాని, 'బాబాయ్! పందిగా పది కాలాలు బ్రతకనవసరంలేదు. నందిగా నాలుగుకాలాలైనా బ్రతికితే చాలు. ఆయనతో పంచుకున్న మధురమైన జీవితానుభవాలు నా జీవితమంతా వెళ్ళదీయడానికి చాలు. ఆయన ఆశల్ని సఫలీకృతం చేయగల స్థితిని కల్పించు-చాలు!' అన్నాను. బాబాయి ఏమీ అనలేదు.

"అటు తర్వాత కొద్దికాలంలోనే బాబాయికి సినీ పరిశ్రమనుండి సంగీత సారథ్యం వహించవలసిందిగా పిలుపొచ్చింది. మా జాతకం మారిపోయింది. డబ్బు, హోదా, అంతస్తు పెరిగాయి. నేను మధ్య మధ్యలో మిమ్మల్ని గురించి తెలుసుకుంటూనే వున్నాను. మీరు శాంతిని చేరదీయటం, డాక్టరేటు పుచ్చుకోవడం అంతా నాకు తెల్సు..."

చంద్ర ఇంకా ఏమో చెప్పబోతుండగా త్యాగరాజశర్మ ఆమెని ఆపి,

"అమ్మా చంద్రా!...మరి నా విధుమౌళి పుత్రుడూ, నా వంశాంకురమూయైన మనుమడు ఏడమ్మా?" అనడిగాడు.

చంద్ర ఖిన్న వదనయై అంది.—"క్షమించండి మామయ్యా! వాడు ఇప్పుడీదేశంలో లేడు. లండన్‌లో ఉన్నాడు. డాక్టర్‌కోర్సు చదువుతున్నాడు. మరో సంవత్సరం చదివితే పూర్తవుతుంది. అప్పుడు వచ్చేస్తాడు" అని వెంటనే, "మామయ్యా! నేను నిర్భాగ్యురాలివి. ఆయనకు ఇచ్చిన మాట నిల్పుకోలేకపోయాను. వాడికోరిక ఎంతసేపూ ఇంగ్లీషు చదువుల మీదేగాని సంగీతం వేపు లేదు. బాబాయీ, నేనూ ప్రయత్నించి ప్రయత్నించి విఫలమయ్యాము. చివరకు విసిగి, ఓనాడు వాళ్ళ నాయనగారి కోరిక చెబితే, 'సంగీతమంటూ నన్ను అట్టే విసిగించారంటే మీతో చెప్పా పెట్టకుండా ఇల్లు విడిచి వెళ్ళిపోతాను' అన్నాడు. అందుకు మేమిద్దరం రాజీకివచ్చి వాణ్ని

ఇంగ్లీషు చదువులకే అంకితం చేశాం" అంది పూరుకుపోయిన కంఠంతో.

"వాడికి ఏం పేరు పెట్టారు చంద్రా?"

"మా బాబాయి పేరు-రామశాస్త్రి అని పెట్టుకున్నాం."

చివుక్కుమంది త్యాగరాజశర్మ మనసుకు. 'తన ఇంట్లో వాడు పుట్టి ఉంటే తన పేరుపెట్టేవారు!' అనుకున్నాడు. కాని అంతలోనే 'ఔను! తనువాడిని ఎంత నిర్బంధించాడు? విధుమౌళి విద్యగురించి ఎంత పట్టుదలగా ఉన్నాడు? వాడి మనసునెరిగి ఏనాడు ప్రవర్తించాడు? అందుకే తన మనసెరిగి విద్యాదానం, కన్యాదానం చేసిన మామగారి పేరు కొడుక్కి పెట్టుకున్నాడు విధుమౌళి. ఐనా పేరులో ఏముంది?' అనుకున్నారు. మనసులో ఏమూలో ఉన్న ఆశకాస్తా అణగారిపోగా పైకి మాత్రం యధాలాపంగా అడిగాడు-

"మరి మీ బాబాయిగారు ఏరమ్మా?" అని.

"ఏవో రెండు సినిమాలకి సంగీత నిర్వహణ చేయవలసి ఉందట. ఆ పని పూర్తవగానే వస్తాన్నారు."

జరిగిన దాన్ని తలచుకుంటూ విదేశాలనుండి రాబోయే మనుమడి కోసం ఎదురు చూస్తూ రోజులు వెళ్ళదీస్తున్నారు త్యాగరాజశర్మ.

* * *

అనుకున్న ప్రకారం గోపాలరావు వినాయక చవితినాటి రాత్రి గాన సభ ఏర్పాటు చేశాడు.

వేదికమీదికి గోపాలరావు వచ్చాడు. స్వాగతోపన్యాసమూ బహుమతిప్రదానమూ అన్నీ యధావిధిగా ముగిసిన తరువాత సంగీత సభ ప్రారంభమయ్యింది. త్యాగరాజశర్మ, గోపాలరావు, మిగిలిన ఉపాధ్యాయులూ, మరికొంతమంది ఆహ్వానితులూ ముందు వరుసలో కూర్చున్నారు.

ముందుగా విష్ణుమూర్తిగారు వేదిక నలంకరించారు. అంత వరకు మాటలతో, నవ్వులతో కోలాహలంగా ఉన్న ఆ ప్రదేశమంతా సూదిపడితే వినిపించేంత నిశ్శబ్దంగా తయారయ్యింది. తన అద్భుత పాండిత్యంతో, కమ్మని కంఠంతో ప్రజల నుర్రూతలూగించి ఆయన

తన సంగీతసభ చాలించాడు. తదనంతరం యువకుడూ, స్ఫురద్రూపీ, వినయవంతుడైన త్యాగరాజశర్మ అప్పుడే కారుదిగి వచ్చాడు. తన ఆలస్యానికి సభకి క్షమాపణలు చెప్పుకుని తన కచ్చేరీ ప్రారంభించాడు. ఇందాక పాడిన విష్ణుమూర్తిగారితో ఏమాత్రం తీసిపోదన్నట్లుగా పాడాడు. అందులోనూ 22 సంవత్సరాల యువకుడూ, చక్కనివాడూ ఐన అతని గానం విన్న ప్రజలు కోరి కోరి వారికిష్టమైన కొన్ని కృతులు పాడించుకున్నారు.

"ఇంక చివరగా శోభిల్లు...సప్తస్వర అను త్యాగరాజ కృతి-జగన్మోహిని రాగం-రూపక తాళం." అని ఎనౌన్స్ చేయగానే రాగాలాపన చేశాడా గాయకుడు. అద్భుతంగా కీర్తన పాడాడు. స్వరకల్పన చేస్తున్నాడు. గానసుధా మాధురి సాగుతోంది. తన్మయుడై వింటున్నాడు త్యాగరాజశర్మ. ఆయనకి తన గానసభ గుర్తుకివస్తోంది. జమీందారుగారి ఆస్థానంలో కంకణం తొడిగించుకున్న క్షణాలు గుర్తొచ్చాయి. ఈ పిల్లవాడు ఎవరోగాని చాలా బాగా పాడుతున్నాడు. సభముగిపినతరువాత అభినందనలు తెల్పాలి' అనుకుంటూ మైమరచి వింటున్నాడు గానాన్ని. కనులు మూసుకుని వింటున్న వాడల్లా ఒకేసారి-"ఆపు!" అంటూ ఎంతో ఉద్రేకంగా అరిచాడు. ఆ మాటలతో వేదిక మీద ఉన్నవారే కాక సభికులూ ఆశ్చర్యపోయారు. గానం ఆగిపోయింది.

గబగబా పెద్దపెద్ద అంగలు వేసుకుంటూ తనున్న చోటు నుండి కదలి వేదిక వద్దకు వెళ్ళారు.

"నీవు గానసభ చేయడానికి అనర్హుడవు. వెంటనే ప్రజలకు క్షమాపణలు తెల్పి వేదిక దిగి వెళ్ళిపో!" అన్నాడు.

ఊహించని ఈ హఠాత్ పరిణామానికి ప్రజలంతా స్థబ్ధులయ్యారు. గాయకుడు మట్టుకు-

"మీరు చాలా ఉద్రేకంగా మాట్లాడుతున్నారు!" అన్నాడు.

"లేదు. నేను ఉద్రేకపడటం కాదు. నువ్వు స్వరకల్పనలో అన్యస్వర ప్రయోగంచేసి రాగలక్షణాన్నే మారుస్తావా? సంగీతం పూర్తిగా రానివాడివి వేదిక ఎందుకు ఎక్కావు?" తాండవానికి సిద్ధంగా ఉన్న శివుడిలా ప్రశ్నించాడు.

ఈ మాటలతో కోపోద్రిక్తుడైన గాయకుడు ఒడిలోనుండి తంబూరని తీసి క్రిందపెడుతూ-"ఎవరండీ, సంగీతం రానివాళ్ళు? మీకు వచ్చా?" ఎదురు ప్రశ్నించాడు.

ఎదురుచూడని ఈ ప్రశ్నకి తడబాటు పడ్డాడు. కొయ్యబారి పోయాడు. ఏమీ చెప్పడానికి బదులురాక దిక్కుదోచక గాయకుని వంకే చూస్తుండి పోయాడు. వెంటనే అందుకున్నాడు గాయకుడు-

"సంగీతంలో ఓనామాలుకూడా తెలియని మీరు సభాముఖంగా నన్ను అవమానిస్తారా?" అంటూ కోపంతో ఊగిపోయాడు.

అపుడు చూశారు త్యాగరాజశర్మ-ఆ గాయకుని చేతిలోని తంబూరని. 'అది తనదే! తనారోజు ఏట్లో విసిరేశాడు. అది వీళ్ళ తండ్రికి దొరికి ఉంటుంది. దానిమీద తన పేరు చెక్కి ఉంది. అది చూసే ఈ పిల్లవాడికి తన పేరుపెట్టి ఉంటారు. కాస్తో కూస్తో సంగీతం చెప్పించి ఉంటారు. మిడిమిడి జ్ఞానంతో ఇతనేమో శుద్ధ తప్పులు పాడుతున్నాడు.' తంబూర మీదున్న తనపేరు స్పష్టంగా కనిపించ డంతో త్యాగరాజశర్మకి కొండంత బలం వచ్చినట్లయింది.

"చూడు! ఇందాక నువ్వు స్వరకల్పన చేయడంలో అన్యస్వర ప్రయోగం చేయలేదూ?"

"లేదు!"

"పోనీ, ఇందాక పాడినట్లు మళ్ళీ స్వరకల్పనచేస్తూ పాడు. ఎక్కడ తప్పుగా స్వరకల్పన చేశావో చెబుతాను."

పగలబడి నవ్వాడు గాయకుడు.

"మీకు సంగీతం రాదని మీరే ఒప్పుకున్నారు. స్వరకల్పన అదంతా మీకు ఏమితెల్సని నన్ను తప్పు పట్టగలరు? నాతప్పుని చూపించగలరు?"

"ఆపింక! మా సోదరుడు గాయకుడు. అసలు నీవు మీటు తున్న తంబూరాకూడా ఆయనదే. ఆయన చనిపోయాక ఆ విషాదాన్ని భరించలేక నేను దాన్ని ఏటిలోకి విసిరేశాను. అది మీవాళ్ళకి దొరికి ఉంటుంది. దానిమీద మా సోదరునిపేరు చెక్కబడి ఉంది. అదిచూపి నీకూ అదే పేరుపెట్టి ఉంటారు. తప్పులు పాడటానికి సిగ్గులేదూ?"

"నన్ను గురించీ, మిమ్మల్ని గురించి కట్టు కథలు ఎన్నో

పొందికగానే అల్లారు. కాని నేను ఇప్పుడు తప్పులు పాడినట్లు మీ చనిపోయిన సోదరుడు వచ్చి చెప్పి వెళ్ళిపోయాడా-ఏం?" అన్నాడు చిరుమందహాసం చేస్తూ.

ఆ గాయకుడు కూర్చునే ఉన్నాడు. త్యాగరాజశర్మ నిల్చునే వున్నాడు. ప్రజలంతా ఆశ్చర్యంతో వున్నారు. వేదిక ముందు మైక్‌లోనుండి వాళ్ళిద్దరి సంభాషణ ప్రజలకి వినిపించుతూనే ఉంది. ఆ గాయకుడే తిరిగి ప్రజల నుద్దేశించి అన్నాడు....-

"గోపాలరావుగారు ఆహ్వానిస్తే వారి మంచితనం గురించి విని వున్నాను కనుక, వెంటనే వచ్చాను. ఈయనగారెవరో నన్ను సాధించాలని ఇలా అంటున్నాడు. తన సోదరుడు సంగీత విద్వాంసుడు గనుక తనకి సంగీతం రాకున్నా నేను తప్పు పాడినట్లు అర్థమయ్యిందట. నేనింతవరకు ఏ వేదిక మీదా ఇంతగా అగౌరవింపబడలేదు. గోపాలరావుగారు ఎక్కడవున్నా వెంటనే రావాలి."

అంతవరకూ అయోమయంగా వేదికవేపు చూస్తున్న గోపాలరావు వెంటనే వేదిక వద్దకు వచ్చాడు.

గోపాలరావుగారు రాగానే ఆయనన్నుద్దేశించి, "గోపాలరావు గారూ! నన్ను ఈయన ఎంతగానో అవమానించారు. నేను ఎక్కడ తప్పుగా స్వరకల్పన చేశానో అదైనా ఎలా తప్పు చేశానో నన్ను అవమానించిన ఈ ప్రజలముందే ఈయనగారు తేల్చి చెప్పాలి-చూపాలి.

"అంతేకాదు. నన్ను తప్పు అన్నందుకు సరిగా ఎలా పాడాలో కూడా చూపించాలి. అలా చూపించకలిగితే నేను ఈ సభికులందరి ముందు ఆయన కాళ్ళు పట్టుకుని క్షమించమని అడుగుతాను. చూపించలేకపోతే ఆ పని ఆయనే చేయాలి. ఈ రెంటిలో ఏదీ జరగకుంటే విద్వాంసుడనైన నన్ను ఇంతమంది ముందు అవమానించినందుకు నేను చట్టరీత్యా చర్య తీసుకొంటాను. రెంటిలో ఏదో తేల్చి ఐదు నిముషాలలో చెప్పండి!"

ఆయనకెలాగూ పాడటం రాదు. తనని క్షమించమని అడుగుతాడు. ఇదీ అతని ధైర్యం.

ఆ గాయకుని మాటలూ, మనసూ వెంటనే గ్రహించాడు గోపాలరావు. 'ఈయనకి పాడటం రాదని తెలిసి ఇంతగా బీరాలు పోతున్నాడు. నేరకపోయి ఈయన్ను పిలిచానురా భగవంతుడా!' అనుకున్నారు. కాని నోరెత్తే సమయం కాదది. క్షణం ఆలోచించి, "శర్మగారూ! మీకు తెల్సు. నేను న్యాయంగా పోయే మనిషిని. అనవసరంగా మీరు ఈ విద్వాంసుడిని అవమాన పరిచారు. అందుకు నేను ఎంతో విచారిస్తూ మీ తరపున నేను క్షమించమని అడుగుతున్నాను. ఐనా లాంఛనప్రాయంగా మీరు ఒక్కసారి, 'సారీ!' చెప్పండి-చాలు!" అభ్యర్థించాడు.

క్షమాపణలు చెప్పడానికి నిశ్చయించుకున్న అతని కళ్ళముందు సరస్వతీదేవి కన్నీళ్ళతో సాక్షాత్కరించింది. 'ఈనాడు నీవు విడిచి పెడితే మరో వేదికపైన కూడా తప్పుగా పాడతాడు!' అన్నట్లుందామె దీనమైన చూపు.

ఇంతలో ఆయునలో ఏమూలో దాగి ఉన్న సంగీత కాంక్ష పురి విప్పింది. తల విదిలించాడు. 'ఔను. మరో వేదిక మీద తప్పు పాడకుండా చేయాలి!' అనుకుని ఇందాకటి తన నిశ్చయాన్ని ఉపసంహరించుకుని గాయకుని వద్దకు వెళ్ళాడు. లాక్కున్నట్టుగా ఆయన చేతిలోని తంబూరాని తీసుకున్నాడు—

ఇన్ని సంవత్సరాలు తను సంగీత కళకి చేసిన అవమానాన్ని మన్నించి తన గానంలో లోపం లేకుండా దీవించమని సంగీత సరస్వతీమతల్లిని ప్రార్థించాడు. తంబూర శృతి చేసుకుని, జగన్మోహిని రాగాన్ని జగన్మోహనంగా ఆలపించి అనంతరం కీర్తన మొదలు పెట్టాడు.

ప్రజల్లో ఆనందం—ఉత్సాహం—ఆశ్చర్యం—

గోపాలరావుకి లోకమంతా తిరుగుతున్నట్లుంది.

ఔను. పాములు పరవశించిన గానం అది. పశువులు సైతం ప్రేమించిన మాధుర్యమది. పామరులకు సైతం పరమాత్మాన్వేషణ జరుపగలిగే శక్తి నీయగల్గిన కంఠ మది. ఇన్ని సంవత్సరాల తర్వాత కూడా చెక్కుచెదరని చాతుర్య మది—

పాట ఆగిపోయింది. ఐదు నిముషాల తర్వాత గాని ఎవరూ ఈ లోకంలోకి రాలేకపోయారు.

"పాడవల్సిన విధం తెలిపాను. ఇపుడు ఈ గాయకుడు ఎక్కడ ఎలా తప్పు పాడాడో చూపిస్తాను" అని త్యాగరాజశర్మ గొంతు సవరించుకొన్నాడు.

వెంటనే, "అవసరం లేదు!" అంటూ ఆ గాయకుడు లేచాడు. గొంతు విప్పి—

"ప్రియమయిన ప్రజలారా! నా ఒప్పందం ప్రకారం నేను మీ అందరి ముందు ఈయన కాళ్ళు పట్టుకుని క్షమాపణలు చెప్పుకుంటున్నాను. నేను తప్పుగానే పాడాను. నేను ఓడాను. ఐనా నేను సిగ్గుపడటం లేదు!" అంటూ త్యాగరాజశర్మ కాళ్ళని తాకి నమస్కరించాడు. లేచి తిరిగి మొదలు పెట్టాడు.

"నేను సిగ్గుపడటం లేదన్నాను గదూ! అందుకు కారణం—వీరు మా తాతగారే! అవును. మీరంతా నమ్మండి! వీరు మా తాతగారు. వీరి పేరు మీరందరూ అనుకుంటున్నట్లుగా మృత్యుంజయ శర్మగారు కాదు. వీరి అసలు పేరు త్యాగరాజశర్మ. నేను వీరి పుత్రుడు విధుమౌళి శాస్త్రిగారి కొడుకుని. కొన్ని కారణాలవల్ల మా తాతగారు సంగీతాన్నీ, సంగీతవిద్య కారణంగా మా నాన్న ఇల్లునీ విడిచారు.

"అద్భుత సంగీత సార్వభౌములైన వీరు లోకం నిరాదరణ చేసిందన్న కోపంతో ఆ కళమీదే హీనాభిప్రాయం ఏర్పరచుకున్నారు. గొంతు విప్పి పాడకుండా తన విద్యను నలుగురికీ చెప్పకుండా అర్థం పర్థంలేని ఆవేశంతో సంగీత కళకి చేస్తున్న ఈ అవమానాన్ని భరించలేక 'ఏ నాడైనా మీచే నలుగురిలో పాడిస్తాననే' ప్రతిన నెరవేర్చేందుకే నేను తెలిసి కూడా తప్పుగా పాడి సభా మర్యాదను అతిక్రమించాను.

"అందుకు ఇక్కడున్న పండితులూ, ప్రజలూ, అభిమానులూ, పెద్దవారూ, విద్వాంసులూ, విమర్శకులూ ఎల్లరూ నన్ను మన్నించాలి. ఒకే స్వరం ఎవ్వరికీ వినిపించనంత చిన్నగా, తప్పనే అభిప్రాయం అసలు కలుగనంత సూక్ష్మంగా అన్యస్వర ప్రయోగం చేసాను.

అందుకు సభాభిముఖంగా మళ్ళీ నేను క్షమించమని మీ అందరినీ కోరుతున్నాను.

"ఈ చిన్న లోపం కూడా కనిపెట్టగలిగిన వీరు అనగా మా తాతగారు ఇన్ని రోజులూ తెరమరుగున ఉండటం శోచనీయం. అందు కనే నేనలా ప్రవర్తించవలసివచ్చింది. అన్యథా భావించక నిండు మనసుతో మీరంతా ఆశీర్వదిస్తారని ఆశిస్తూ ముగిస్తున్నాను."

సభంతా కరతాళ ధ్వనులతో నిండిపోయింది. లండన్‌లో వున్నాడనుకున్న మనుమడు కళ్ళెదురుగా కనబడేసరికి త్యాగరాజ శర్మకి మాటలే కరువైనాయి. అప్పుడు ఆయనకు కలిగిన భావాలని వర్ణించడానికి కావ్యాలైనా చాలవేమో.

'పాడనని శపథం చేసిన తను మనుమడి కారణంగా వేదిక ఎక్కడం ఆనందాన్నే కలుగజేసింది. మరి మనుమడి పేరు గురించీ, విద్యను గురించీ చంద్ర అబద్ధమెందుకు చెప్పింది? ఆఁ ఔను. ఆమె అలా చెప్పకుంటే ఈ యువకుడు తన మనుమడని తెలిస్తే తను వేదిక ఎక్కేవాడు కాడు. అందుకే అలా తల్లిని ముందు పంపించి తను గోప్యంగా ఉన్నాడు.'

పరిపరి విధాల ఆలోచిస్తూ మాటలు కరువై ఆనందంగా మనుమడివేపు చూస్తున్న ఆయన్ని గోపాలరావు సభాభిముఖంగానూ, విడిగానూ ఎంతో ప్రశంసించాడు. పట్టుబట్టలతో సత్కరించి, "నేను ఎందరిగానాన్నో విన్నానుగాని, ఈ అపూర్వ గంధర్వగానం వినలేదు. శర్మగారు మాణిక్యంవంటి వారు. మట్టిలో పెట్టినా, మణుల మధ్య పెట్టినా వెలుగు ఆయన సొంతం. ఏ విద్యలో పెట్టినా వారధికులే!"

సభలో కరతాళ ధ్వనుల మధ్య గోపాలరావు అన్న మాటలివి.

* * * *

అదొక పర్ణశాలవంటి గృహం. ఆ గృహానికి ముందు ...్యగరాజ సంగీత నిలయం" అన్న బోర్డుంది. అందులో ...గోరే వారి కులం ఎవరూ అడగరు. గుణాల్ని పరీక్షించి, ...తాన్ని గమనించి, అర్హుడనుకుంటే ఉచిత భోజన వసతులతో సంగీత విద్యాశక్తి ఉన్నవారికి ఆ విద్యని ఉచితంగా నేర్పించుతారు.

ఆ రోజు త్యాగరాజశర్మ గానం విన్న ప్రజలు ఎంతో మెచ్చారు. తత్ఫలితంగా, తాతా మనుమలకి చాలా చోట్ల నుండి కచ్చేరీలకై పిలుపు రావడం అంతులేని ధనార్జనకే గాక కీర్తి ప్రతిష్ట లకి కూడాకారణ మయ్యింది.

ఓ రోజు శాంతి తన మెడలోని చంద్రహారాన్ని తీసి చంద్రకి అందజేస్తూ-"తాతయ్య తన యింటి కోడలికి దీన్ని అందజేయాలను కున్నారట. వారి కొడుకు కోసం ఎంతో కాలం ఎదురు చూపి నిరాశ చేసుకుని చివరకు నాకిచ్చారు. ఇపుడు మీరు వచ్చేశారు. ఇంక ఇది నావద్ద ఎందుకు? మీరే దీన్నుంచండి!" అంది.

అందుకు చంద్ర చిన్నగా నవ్వి, "మీ తాతయ్య పొరపాటు ఏమీ చేయలేదమ్మా! అనాలోచితంగానే ఈ ఇంటికి కాబోయే కోడలికి దాన్ని అప్పగించారు-ఉంచు!" అంది.

ఆ మాటలకి అర్థం తెలుసుకున్న శాంతి సిగ్గుతో అక్కడి నుండి పరుగెత్తింది. అదే సమయంలో అక్కడికి వచ్చిన తనతో చంద్ర ఆ విషయమంతా చెప్పింది. తన బాధ్యత తీర్చినందుకు చంద్రకి కృతజ్ఞతలు చెప్పుకుని శాంతిని ఆమెకి అప్పగించి నిశ్చింతగా ఇక్కడికి వచ్చేశాడు.

ఆలోచన ముగించి స్నానం చేసాడు త్యాగరాజశర్మ. ఈ లోగా తూరుపు తెల్లవారింది. లేతభానుడి నీరెండలో సూర్య నమ స్కారాలు చేసి పర్ణశాలలోనికి వెళ్ళడానికి వెనుదిరిగాడు. అంతలో... ప్రాతఃకాల సంగీత సాధన చేస్తున్న మనుమడి కంఠం వినిపించింది.

"శోభిల్లు సప్తస్వర!" అంటూ! 'నిజమే! మహానుభావుడు త్యాగరాజస్వామి ఏ క్షణంలో ఈ కీర్తన రచించారోగాని అది అక్ష రాలా నిజం. అది అక్షర లక్షలుచేసే మాట. ఎన్ని యుగాలకైనా నిల్చిపోవలసిందే ఆ సప్తస్వరాలు. తనబోటి వాళ్ళెందరు అడ్డుకో బోయినా ఆ స్వరవాహిని ఆగకూడదు. యుగ యుగాలకూ సంగీతమే మానవుడి ప్రియమైన లలితకళ కావాలి. నిజం—నిజం. సప్తస్వ ఇలాగే శోభిల్లాలి! శోభిల్లు సప్తస్వర!' పర్ణశాలవేపు చూస్తూ నిండు మనసుతో అనుకున్నాడు త్యాగరాజశర్మ.

—:అయిపోయింది:—



## మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA133M140 |
| పుస్తకం పేరు | విజయ |
| తారీఖు | 31/10/24 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 85 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | C.F, BCF |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Sowmya |
| పేజీలు విడదీసినది | Sowmya |
| స్కాన్ చేసినది | ch.Ramya |
| పరీక్ష చేసినది | HASEEMA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |